" రసభారతి " [ పద్య కవితా సంపుటి ]
రచయిత : " మధురకవి " ర స రా జు

సర్వస్వామ్యములు : రచయితవి

ముఖచిత్రం : బా లి

ప్రథమ ముద్రణ : ప్రజాపతి ఉగాది [ 17-3-1991 ]

ప్రతులు : 1000

ప్రతులకు : శ్రీమతి రంగినీని సూర్యనారాయణమ్మ
C/o శ్రీ ర స రా జు
తణుకు - 534 211
పశ్చిమగోదావరి జిల్లా [ A. P. ]

మూల్యం : ఇరవై అయిదు రూపాయిలు

తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయముతో ప్రచురితం

ముద్రణ : యు. యస్. ప్రింటింగువర్క్సు, మారుటేరు - 534 122
ఫోన్ నెం. 304 [ పెనుగొండ ఎక్స్చేంజి ]

" కళాప్రపూర్ణ " లలితా నగర్
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, రాజమహేంద్రి-533105

# అక్షరానందము

శ్రీ రసరాజుగారు తరచు నా యోగ క్షేమములు కనుగొను చుండు ఆత్మీయులు. నాడు, నేడు అవిచ్ఛిన్నముగా సాగుచున్న ఛందో మార్గమును నిస్సంకోచముగా అనుసరించుచున్న కవి వీరు. సంప్రదాయ రీతిలో సాగిన వివిధ విషయస్పృష్టమైన శీర్షికలతో " రసభారతి " కి హారతిపట్టిన కవి.

వర్ణ చిత్రాలు, రసరేఖలు, వెలుగు పూలు, విద్యుత్ జ్యోతి మున్నగు శీర్షికలు పుటపుటకు చైతన్యస్ఫూర్తి కలిగించుచున్నవి. రాయలు, విశ్వనాథ, జాషువా, నారాయణరెడ్డి మున్నగు నాటి నేటి కవులు ఇందు స్తుతింపబడిరి.

సులభసుందరమైన వీరి పలుకుబడికి, నిరాటంకమైన ఛందోరీతికి " ప్రౌనుదార " ప్రస్తుతినుండి ఒక ఉత్పలము—

" ప్రౌనుదారా ! మహాత్మ ! రసబంధుర మాంధ్రకవిత్వ సుందరో
ద్యాన వనంబులో నొదిగి- హాయిగ- కావ్యసుమాలలోన-పూ
దేనెను గుండెలంటగను తృప్తిగ త్రావిన మేటితేటి వీ
వై- నవరాగమాలికల నల్లితివయ్య రసోచితంబుగన్ !"

మనోజ్ఞమైన వీరిశైలికి ఎన్నో ఉదాహరణములు చూపవచ్చును. వీరి పద్యపఠనరీతియు రసరాగ రంజితము.

ఇటీవల వెండితెరవైపు పరువిడుచున్న వీరి కలము ఫలోన్ముఖము గాక !

— మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
6-3-91

' జ్ఞానపీఠ అవార్డు గ్రహీత " కళాభవన్
'పద్మశ్రీ" డా॥ సి. నారాయణరెడ్డి సైఫాబాద్
[వైస్‌ఛాన్సలర్: తెలుగు విశ్వవిద్యాలయం] హైదరాబాద్-4

# అభినందన

"మా ప్రభుత్వమున దైవత్వమ్మె దీపించెడిన్" అని అంటాడు రసరాజు. ఇక్కడ దైవత్వమంటే దేవుళ్ళ కొలువున్న వ్యవస్థ అని కాదు. కసి మసి అంటని శిశుత్వం. పండువెన్నెల్లా పరిశుద్ధంగా నవ్వ గలిగే బాల్యం. బాల్యం స్వచ్ఛభావనలకు సంకేతం. బాలలరాజ్యం అంటే క్షుద్రమనస్సులు విధించిన అరపొరలులేని రాజ్యమన్నమాట. ఈ శీర్షికలో రసరాజు రచించిన పద్యాలు ఒక ఆదర్శప్రభుత్వానికి ప్రతీకలు. అంతేకాదు— ఈ పద్యాల్లో కనిపించే బాలరాజు రసరాజే.

హృద్యభావుకత, పద్యచాలన చతురత మేళవించుకున్న కవితా మూర్తి రసరాజు. అతనిది నడిచే పద్యంకాదు- పాఠకుణ్ని తనవెంట పరుగులు తీయించే విద్యుద్గమనం. మరోసారి జాషువా ఈరూపంలో మందహాసం చేస్తున్నాడా అనిపించేటంత మధుర గభీర రచన అది.

పండగల గురించి రాసినా, ప్రముఖుల గురించి అభినందనలు రాశివోసినా, సమకాలీన వస్తువుగురించి రాసినా, సంస్మరణాత్మక రచన సాగించినా, పద్యంలో ఏ భావాన్నైనా పదునుగా ప్రకటించ గలిగే, ప్రావీణ్యం రసరాజుకు అలవడింది- ఈ "రసభారతి"లో ఏ పద్యాన్ని పట్టిచూసినా ఆర్ద్రత అగుపిస్తుంది- ఆత్మీయత పలకరిస్తుంది.

ఇంతటి భావశీలి, పద్యరచనా శిల్పిహాళి, ఖండికలతోనే సరి పెట్టుకోకుండా ఒక సమగ్ర పద్యకావ్యం రాయాలని నా ఆకాంక్ష. ఛందస్సులో— అందులో పద్యఛందస్సులో కావ్యనిర్వహణ శక్తి ఉన్నవాళ్ళు కరువైపోతున్నారు. రసరాజు అందుకు సమర్థుడని ఈ రసభారతి సాక్ష్యం చెబుతున్నది.

అప్పుడప్పుడు రాసిన చక్కని కవితాఖండికలను ఈ గ్రంథ రూపంలో అందిస్తున్న రసరాజుకు నా హార్దికాభినందన!

— సి. నారాయణరెడ్డి

10-3-91

"కళావాచస్పతి"
కొంగర జగ్గయ్య, బి.ఏ., లిట్.
" సుషమ "

ఎ.సి. 5/సెకండ్ ఎవెన్యూ
అణ్ణానగర్
మదరాసు - 40

# ఆంతర్యం

పద్యరచన ఒక విశిష్టమైన విద్య. ఆ రచన హృద్యంగా చేయగలిగినవారు అరుదై పోతున్న యీ రోజులలో "రసరాజు" గారి "రసభారతి" ఆవతరణ-రసజ్ఞ లోకానికి పర్వప్రాయమనడం నిస్సందేహం.

పద్యానికి కాలం చెల్లిందనే వాదనతో నేనేకీభవించను. నన్నయగారి "ఆంధ్ర మహాభారతం" మొదలుకొని, ఏటుకూరివారి "పలనాటిభారతం" వరకూ, పద్యం అందరినీ అలరిస్తూనే వచ్చింది. ఇకముందూ అలరిస్తూనే ఉంటుంది. అయితే ఈ శిల్పాన్ని రసవత్తరంగా మలచగలిగినశక్తి యీనాడు కొద్దిమందికే పరిమితమైపోయిందన్నమాట వాస్తవం. ఆ కొద్దిమందిలో "రసరాజు"గా రొకరు కావడం మనం గర్వించదగిన విషయం.

'రసరాజు' గారు నాకు హితులూ, సన్నిహితులూ. కొన్ని సంవత్సరాలుగా నేను వారి కవితలను విని, చదివి, స్పందించిన ఘట్టాలెన్నో ఉన్నై. వారి కవిత్వపు "మోజు"లో పడిన వారిలో నేనూ ఒకడినని మోమోటం లేకుండా చెప్పగలను. రంగిసీని సత్యనారాయణరాజు అన్న పేరుకు సంక్షిప్త రూపం "ర.స.రాజు." మరొకవైపు కవితారససంపన్నుడు కూడా కనుక, ఆయనది అన్వర్థనామధేయం.

ఈ "రసభారతి" కవితా సంపుటిలో ప్రత్యేకత ఏమిటి అని ప్రశ్నించుకున్నప్పుడు, నాకు మొదట కనిపించింది - ఈ కవి ఎన్నుకున్న వస్తుస్వభావం. ఏ కవిత్వానికయినా మూలం కవి చుట్టూఉండే ప్రపంచమే! తను మసలే సమాజమే! తన జీవితమే! వీటికి సంబంధించిన సంఘటనలూ,

సంవేదనలూ ప్రతి వ్యక్తిలోనూ స్పందన కలిగిస్తాయి. కాని, కవియైనవాడు తాను పొందిన స్పందనకు ఆలోచన జోడించి, దాని వెనుక దాగిఉన్న సత్యాన్ని దర్శించడానికి ప్రయత్నిస్తాడు. ప్రతి మనిషీ ఏడురంగుల్ని చూస్తున్నాడు. అవే నిజమనుకుంటున్నాడు. కాని శాస్త్రజ్ఞుడొక్కడే తన పరికరాలద్వారా ఆ ఏడు రంగుల నిజతత్వాన్ని తెలుసుకోగలుగుతున్నాడు. ఇక, కవి తాను దర్శించిన సత్యాన్ని పదిమందికీ చాటిచెప్పగలగాలి. అప్పుడే కవిత్వానికి ప్రయోజనం సిద్ధిస్తుంది. అలా చెప్పలేనివాళ్లుకూడా ఉంటారు. వాళ్లు-జీవితంలో, సమాజంలో, ఉత్పన్నమయ్యే ప్రశ్నలను ఎదుర్కొనలేక, దూరంగా పారిపోతారు. ధైర్యంతో ఆ ప్రశ్నలను ఎదుర్కొని, నిజాయితీతో వాటిని విశ్లేషించగలిగినవాడే నిజమైన కవి !

ఈ కవి ధైర్యవంతుడూ, నిజాయితీపరుడు. కనుకనే వర్తమాన సామాజిక జీవితాన్ని వేధించే సమస్యలను తన కవితావస్తువులుగా స్వీకరించాడు; వాటి లోతుపాతుల్ని మథించాడు; నిజాన్ని నివేదించాడు; తోటి వారి నుద్బోధించాడు. ఈ కోణంనుంచి చూచినప్పుడు, యీ కవిని జాషువా గారి వెనుక నిలుపవచ్చు.

ఈనాడు దేశంలో తలయెత్తిన మతవిద్వేషం, మతదురహంకారం చూచి యీ కవి హృదయం వికావికలైంది.

"...కులాలున్ మతముల్ మనుష్యులను మట్టుంబెట్ట నింకేడ జా
తికి స్వాతంత్ర్యము?" అని ఆవేదనను వ్యక్తం చేస్తూ—

"మమత నశించి, ద్వేషము
సమాజములో నెలకొన్న చో భవి
ష్యము శిరమ్ము" అని జాతిని
ఎచ్చరిస్తున్నా డీ కవి.

అంతేకాదు :

"భరత మహోర్వియందు భగ
వంతుని గొల్చెడి మందిరాలలో

పరమ కిరాతకంబగు
తుపాకులు దాగిన రోజులివ్వి—"

అని పంజాబ్ దుస్థితిని వివరిస్తూ,

"సిక్కు" ముడివేసి యింటిలో చిచ్చుపెట్టు
నిప్పులున్నవి ఈ ప్రక్క నివురుగప్పి;
నీళ్ళనీళ్ళని పెట్రోలు చల్లు పెద్ద
బుర్రలున్నవి ఆప్రక్క పొంచిపొంచి".

అనే నిజాన్ని బయట పెడుతున్నాడు.

"కమలముల కభి 'మతము' భాస్కరుని వెలుగు
కలువలకు స 'మ్మతము' హిమకరుని జిలుగు
వలచిన "మతమ్ము" లేవైన, బ్రదుకునిచ్చు
కొలను కెన్నడు చేటును గూర్పలేదు-

అనే శాంతి, సమైక్యతా సందేశాన్ని ప్రకృతి పరంగా అందిస్తున్నాడు.

మనకు స్వాతంత్ర్యం ఎలా వచ్చింది? ఎంతమంది దాన్ని సాధించడానికి ఎన్నెన్ని త్యాగాలు చేశారు? అనే చరిత్రనే మనం మరచిపోతున్నాం. ఆనాడు కొన్ని కోట్లమంది జీవితాలను ఉత్తేజపరచిన "దేశభక్తి" ఈనాడు మన జీవన విధానంనుండీ, ఆలోచనా పథంనుండీ అంతరించి పోతున్నది. ఈ దుస్థితికి కవి దుఃఖిస్తున్నాడు; స్వాతంత్ర్య యోధుల్ని స్మరిస్తున్నాడు.

"తెల్లదొరలకు పక్కలో బల్లెమగుచు"-
"చీకటి తలదన్నెడి యా వేకువవలె దూకి"-
"ఇమ్మహి పంచభూతముల కెల్లరు నర్హులు....
పరమాత్ముడొసంగిన సృష్టిలోన భాగ్యమ్మును
దోతురా!" అని గర్జించి, త్రినేత్రమూర్తియై
బ్రిటీష్ పరిపాలకులపై నిప్పులు గ్రక్కి,
"ఇరువది యేడు వర్షములకే తల వాల్చిన"

విప్లవజ్యోతి అల్లూరి సీతారామరాజుకి ప్రణతు లర్పిస్తూ అలాంటివారి, జీవితాల నధ్యయనం చేసి, ఈనాటి యువత నూతన స్ఫూర్తి పెంపొందించు కోవాలని ఉద్బోధిస్తున్నాడు.

"వక్రించిన వర్తమానం" అనే కవితలో (పుట 21), నేటి సమాజాన్ని పట్టి పీడిస్తున్న దుష్టధోరణుల నెన్నిటినో యీ కవి వేలెత్తి చూపించాడు. "ఆడు పిల్లలన్ ౘ్రముచ్చిలి భోగవాటికల ముంగిట మానము లమ్మి శీవిగా అచ్చనగాయలాడు కుటిలాత్ములు కొందరు"- ఎంతనిజం ! "విద్దెలన్ గరపు సంస్థలుకూడ దరిద్ర రాజకీయములకు తావులై నిలిచె నక్కట!"- ఎంత సిగ్గు పడవలసిన స్థితి !

మరొక విలక్షణమైన కవిత "బాలల రాజ్యం" (పుట 34). "నవ్వినన్ పూవులు రాలు, లేతనునుబుగ్గలు తాకిన పాలుకారు" బాలల రాజ్యాన్ని ఈకవి నిర్వచించిన తీరు ఎంతో హృదయంగమంగా ఉన్నది. "లేవు తమస్సులిచ్చట, కులీను లవాచ్యులటన్న నీచమౌ భావనలే జనింప విట - బాలల రాజ్యము మాది" అని ప్రకటిస్తారువారు. అంతేకాక, పెద్దల నధిక్షేపిస్తూ "మీలో మీకు నసూయయే ! పరహితమ్మేలేదు ! .... మాకీ క్షుద్రమైనట్టి భావాలే కిట్టవు !" అని బుద్ధి చెపుతారు.

మరొక ప్రశంసనీయమైన కవిత "బ్రౌనుదొర" (పుట 3). ఆంధ్ర వాఙ్మయానికి సి. పి. బ్రౌను చేసిన సేవలకు యావదాంధ్రజాతి కలకాలం ఋణపడిఉంటుంది. ఆ మహానుభావునిపట్ల కృతజ్ఞతతోనిండిన తెలుగు హృదయాల సమష్టికంఠారావాన్ని ఈ కవి తనకలంద్వారా కమనీయంగా వినిపించాడు.

" తాటియాకులలో తలదాచుకొన్న
వెలుగుచూడని కావ్యాలు వెలికితీసి
ముద్రణానందమును గూర్చి – పులిసిపోని
దివ్య రసభిక్ష నందించితే మహాత్మ ! "

నిజమే ! బ్రౌను పూనుకోకపోతే, మన పరిస్థితి ఎలా ఉండేదో ఊహించడం కష్టమే !

" తెలుగు పొలముల కలికివెన్నెలలు పండె
తాటను మహానుభావుని కారణమున,
తెలుగుసాహిత్య కేదారములు ఫలించె
నీ కతాన.... .... ...."

అన్న ఈకవి మాటలతో ఏకీభవించని వాడుండడు. అంతటితో ఆగలేదీకవి !

" నిక్కము బల్క నన్నయవు — నీ వితరుండవుకావు ! కానిచో
ఎక్కడ రాజమహేంద్రి? మరియెక్కడిదయ్య బ్రిటీష్‌పురంధ్రి?"

ఎంత కమ్మని ఊహ ! ఎంత తీయని భక్తి ! నన్నయ అపరావతారంగా బ్రౌనును భావించి, సంభావించిన కవి హృదయానికి నమస్కరించకుండా ఉండలేము!

" భగ్నజీవి " ( పుట 9) లో, గంభీరమైన భావనా బలంతోపాటు, ప్రగాఢమైన మానవీయత కూడా పొంగులు వారుతుంది. పిచ్చివాళ్ళపట్ల సమాజంచూపే నిరాదరంకానీ, వారిని రాళ్ళతో కొట్టి వినోదించే క్రూర స్వభావం కానీ మనకు తెలియనివికావు. " విధాత ఎంతగా మోసము చేసెనో ! అతని బ్రతుకు మోడయిమాడె......" అని జాలి పడగలిగే వారెందరుంటారు ?

" అతడు శప్తజీవి ; మధురామృత మేదొ, విషమ్మదేదొ తే
డా తెలియంగలేడు— కపటంబు నెరుంగడు— మాయయున్, దగా
చేతులు కల్పనట్టి రససిద్ధిని పొందిన యోగిపుంగవుం
డాతడు — వానితోడ పరి హాసములా ! తగదోయి...."

ఆ పిచ్చివాణ్ణి అర్థం చేసుకోమనీ, మానవతా దృష్టితో ఆదరించమనీ, కవిచేసే అభ్యర్థనకు ఏగుండె కరగదు ?

లోకంలో దేనిని తక్కువగా, చులకన చూచి అందరూ తోసివేస్తారో, దానిపట్ల ఈకవికున్న మక్కువకీ, గౌరవానికీ "జిల్లేడుపువ్వు" (పుట 65) అనే కవిత సాక్ష్యం. "ననుగని యాదరించగల నాథుడె లే"దనుకొన్న జిల్లేడు పువ్వు - " ఉమాపతి శీర్షమలంకరించి " - " ఇది శివరాత్రి, జన్మ కిదియే శివరాత్రి " అని మురిసిపోతుంది.

" పూవుగ పుట్టి, కాయనయి, పొట్ట పెటిల్లన పింజ పింజగా
దేవునికోసమై సకల దిక్కులకున్ బరుగెత్తుచున్న నా
జీవనయాత్ర గాంచి - అరచేతుల కన్నుల గప్పుకొన్న వా
రే విరచింతురింక, రహియించిన యీ పరిణామ గాథలన్"

అనే విశ్వాసాన్ని ప్రకటిస్తుంది. అందుకేనేమో, మల్లె, జాజి, గులాబి మొదలైన పువ్వులన్నిటినీ కాదని, జిల్లేడుపువ్వుకే ధన్యత కల్పించాడీకవి !

ఇవేకాక, పాకిస్తాన్ మొదలు కర్ఫ్యూన్ వరకూ; గాంధీ, నెహ్రూ, మండేలాల మొదలు గాలిబ్, జాషువాల వరకూ; వరదలు మొదలు విద్యుచ్ఛక్తి వరకూ - ఈ కవి స్పృశించిన ఇతి వృత్తాలెన్నో ఉన్నై. వస్తు వరణంలో వైవిధ్యంతోపాటు, విచక్షణతను కూడా ప్రదర్శించిన ఈ కవి ఆదర్శప్రాయుడు.

ఈ కవితా సంపుటిలో మరొక విశిష్టత - శిల్పప్రశస్త్యం. చక్కని ధార, కమ్మనిశైలి ఈకవి సొత్తు. ఎంతో గభీరమైన భావాన్ని సైతం, సరళంగా నలుగురికీ అర్థమయ్యే రీతిలో చెప్పగలిగినశక్తి యీ కవికున్నది. ఆ చెప్పేతీరులో మళ్లీ తన " ముద్ర " ను చెరగనీయడు. ప్రతి భావాన్నీ ఒక "చిత్రం"గా మలచి, పాఠకుని కనులముందు నిలుపగలిగిన ప్రతిభా, దానిలో అంతర్లీనమై ఉండే సందేశమూ, ఈ కవితలలో అడుగడుగునా మనకు ప్రత్యక్షమౌతాయి.

" ఆదరణలేని జీవితంబందు నిలిచి
మథనమును జెంది, యోగసమాధి జొచ్చి
దివ్యమైనట్టి రూపు సాధించి, తేజ
మెసగు "గొంగళి" నాకు ప్రేమైక మూర్తి !"

అన్న పద్యంలోని విలక్షణత, తాత్త్వికత యిందుకు నిదర్శనం. "వర్ణచిత్రాలు" (పుట 68)లో మూడు రకాల "భావచిత్రాలు" మన మనో వీధిలోకి చొచ్చుకుపోయి, జీవితానికి వ్యాఖ్యానం చెపుతాయి.

"నీలి మబ్బుల నింగి మున్నీటదేలి, మించురెక్కల తెల్ల నాడించుకొనుచు, దూసికొనిపోవు పిట్టలు" — "పవలు నేర్చిన ముగ్గుల పాఠములకు, రాత్రివేళ పరీక్షలు వ్రాసివ్రాసి, బడలిపోయిన కన్నెలు" — "పిండి వంటల సంగతి విస్మరించి, చీట్లపేకను దవిలి ఖుషీవలులగు తమ్మగుర్రలు" — నిత్యం కనిపిస్తున్నా మనం పట్టించుకోము. కాని వారే కవి వాక్కులలో సరికొత్తగా ప్రత్యక్షమై మనను పలుకరించి, ఆకట్టుకుంటారు.

''మహిళను గౌరవించని సమాజము రోదసిలోనకేగి, యేగ్రహమున కాలు మోపినను లాభములేదు" — తిరుగులేని నిజమిది.

'ద్వైతమున పాడుకొంటి రద్వైతగీతి' 'నీ గడియారమందు రవి సిద్ధరచెంకిన జాడలేదు", ''రక్తమందు లావా ప్రవహించు", "తలను వంచక పగతుర తలలు దింపి", "రాస్తాలు చలిలో మూలుగుచున్నవి", "కదలుచున్నట్టి దీపకళిక", "రాణ్మహేంద్రి - బ్రిటీష్ పురంధ్రి", బుడుత నెలయేళ్ళ', "నాగరకమ్మన్య సమాజము", 'చరఖా సన్మని', 'రంగవల్లుల రథము', "విలువల వలువలు" ఇత్యాదిప్రయోగాలలో కవికల్పనా స్వేచ్ఛయే కాక, మాటలకూర్పులో ఆయనకున్న సుతారపునేర్పుకూడావ్యక్తమౌతుంది.

మరొకమాట. గీతమైనా, వృత్తమైనా అలవోకగా నడిపించగల సామర్థ్యం ఈకవికున్నది. అంతేకాదు: నాదృష్టిలో-ఆంధ్ర వాఙ్మయంలో సీస పద్యానికి సొగసులు చెక్కినవారు నలుగురు: నన్నయ, శ్రీనాథుడు, రామరాజభూషణుడు, జాషువా. అటువంటి సీసపద్యాన్ని అంత పకడుగానూ కదను తొక్కించగల చాతుర్యం మళ్ళీ ఈకవిలో మనకు కనిపిస్తుంది. "కృష్ణదేవరాయలు" (పుట 2), "దీపలక్ష్మి" (పుట 13), ''మహాత్ముడు" (పుట 25), ''నవవసంతం" (పుట 48)-మొదలైన కవితలందుకు తార్కాణలు.

రసరాజుగారి అనూన ప్రతిభకు అద్దంపట్టే ఈ "రసభారతి" ఆంధ్ర భారతికి అపూర్వమైన అలంకారం కావడంలో సందేహంలేదు.

ప్రజోత్పత్తి-ఉగాది —కొంగర జగ్గయ్య.

మల్లెమాల సుందరరామిరెడ్డి (ఎమ్. ఎస్. రెడ్డి)   ఫిల్మ్ నగర్,
చైర్మన్; ఎ.పి. ఫిల్మ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్   హైదరాబాద్-34

# సార్థక నామం

రసమనోజ్ఞమైన రచనల " పుట్టిల్లు "
బుధులు మెచ్చతగిన " బొమ్మరిల్లు "
మేలిరుచుల నెలవు మీ " రసభారతి "
నరసి మురిసి తృప్తి నందినాను !

ఒక శబ్ద శిల్పమ్ము ఓరచూపులతోటి
కమ్మని రసవృష్టి గ్రుమ్మరించె !
ఒక పద్యకుసుమమ్ము అకలంక సాహితీ
పరిమళద్రవ్యముల్ పంచిపెట్టె !
ఒక పదచిత్రమ్ము ఒకనాటి మనజాతి
శౌర్య ప్రశస్తిని చాటిచెప్పె !
ఒక భావవీచిక ఉవ్వెత్తుగా లేచి
పులకింత లెదనిండ చిలకరించె !

పెక్కులింకేల ? తెల్పెద నొక్కమాట
వినుము రసరాజ ! నోరూరు దినుసులెన్నొ
కానుపించెను నాకు నీకావ్యమందు —
నీది సార్థకనామమ్ము నిశ్చయముగ !

— "సహజకవి" మల్లెమాల
6–3–91

# నా పద్యానికి నేపథ్యం

వర్షం ...
కుండపోతలా కురుస్తున్నది ...
బడికి వెళ్ళే మార్గంలేక ఇంటిపట్టునే కూర్చున్నాను.
ప్రక్కనే నాన్నగారు -
చేతిలో ఏదో పుస్తకం -
ఉన్నట్లుండి ఎందుకో ఆయన ఇలా అన్నారు - "కందాన్ని వ్రాస్తే కవి, అడవిపందిని చంపితే బంటు"

అంతే! ఆ ఒక్క మాటతో నా చిన్నారి మనసు ఒక్కసారిగా తళుక్కుమంది.

"కందపద్యం ఒకేఒక్కటి రాసి కవి అనిపించుకోవచ్చునన్నమాట..." వెనుకా ముందూ చూడకుండా వెంటనే నాన్నగారిని అడిగేశాను ఆ కందం ఏమిటో వివరించమని.

నాన్నగారు ఏమనుకొన్నారో ఏమో-అప్పటి వయసుకు తగ్గట్లుగా కందాన్ని అందంగా పూసగుచ్చినట్లుగా నాకు వివరించి చెప్పారు.

అప్పటికి నా వయసు - పదీ - తప్పితే పదకొండు. హైస్కూలు ముఖమేమిటో తెలియని రోజులవి. కాని, అప్పటికే పాఠ్యపుస్తకాలతో పాటు శతకసర్వస్వం, బాలరామాయణం పూర్తిచేశాను.

తండ్రిగారు వివరించిన ఆ సూత్రాలతో - కందమురదలా - కనపడిన దానిమీదల్లా "కందం" వ్రాయటం మొదలుపెట్టాను.

ఒకటా! రెండా! అలా ఎన్నో...

ఆ తరువాత –

నా అంతట నేనే వృత్తాలచుట్టూ ప్రదక్షిణం చేయటం ప్రారంభించాను. అవీ దాక్షిణ్యభావం చూపాయి.

చివరికి - ఏదో ఒకపద్యాన్ని వ్రాయటమో, లేక చదవటమో ఒక దినచర్యగా మారిపోయింది. నాజీవితంలో, బెళ్ళూరి శ్రీనివాసమూర్తి గారన్నట్లు "గీతమల్లక బ్రతుకు సాగింపలేను..." అన్న అనుబంధం నన్నుకూడ పెనవేసుకొంది.

ఆ దశలో ఎన్నో పుస్తకాల్ని చదివే అవకాశం లభించింది నాకు. జాషువాగారి పుస్తకాలు నన్ను బలంగా ఆకట్టుకొన్నాయి.

అందుకే-

"గోలీలాడు వయస్సులోనె నను అక్కుంజేర్చి - లాలించి - కం
దాలన్ వ్రాయుట నేర్పె మజ్జనకు - డానాడే కవిత్వంబుపై
మేళింగొన్నది నామనస్సు - అటుపై నాకర్షితంబయ్యె - జా
షువ్వా లాలిత్య కవిత్వవాణి - ఇది నా భాగ్యంబుగా నెంచెదన్ !"

అని ఎక్కడో ఏదో సందర్భంలో అక్షరీకరించాను.

అప్పటినుండి ఏదో పద్యం వ్రాస్తూనే ఉన్నాను-అవిచ్ఛిన్నంగా.
ఇదీ నా పద్యానికి నేపథ్యం!...

ఈ రసభారతి ఇప్పుడు మీముందున్నది.

"ఎంత చెక్కితే ఓ శిల్పం ..." అంటారు నారాయణరెడ్డిగారు.

ఈ రసభారతిని ఇలా తీర్చిదిద్దటంలో ఎన్నిహస్తాలు సహకరించాయో-ఎన్ని మనసులు ఉపకరించాయో...

అప్పుడప్పుడూ కవితాసంబంధమైన విషయాలను నాకు వివరిస్తూ వచ్చారు "మహాకవి" కరుటూరి సత్యనారాయణగారు, వేదుల సూరి గారు, డా॥ సి. ఎస్. శాస్త్రిగారూ —

తణుకు వచ్చినప్పుడల్లా ఇంటికి వచ్చి "ఏవీ! ఈమధ్య వ్రాసిన పద్యాలు చదవండి..." అంటూ అభిమానించి ఆకాశవాణికి నన్ను సన్నిహితుణ్ణి చేశారు మహావక్త కీ॥ శే॥ ఉషశ్రీగారు-

పురిటిపొత్తిళ్ళలోనే నా పద్యాలను అభిమానంతో గుండెలకు హత్తుకొని - నేను మరచిపోయినా - నేను మాత్రం మరచిపోలేదంటూ - నా పద్యాలను ఇతోధికంగా ప్రచారం చేశారు కవిమిత్రులు శ్రీ టి. వి. కె. సోమయాజులుగారు-

"రసరాజుగారూ! ఏమిటో మీరు కనిపిస్తే నీరసం పోతుంది .... పద్యాలు బాగా వ్రాస్తున్నారు - సంతోషం!" అని ఆత్మీయంగా పలకరిస్తూ— అమృతహస్తంతో ఆశీర్వదిస్తూ— నేడిప్పుడు "అక్షరానందం" వ్యక్తపరిచారు "కళాప్రపూర్ణ" మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు-

ఎప్పుడు కనిపించినా "పుస్తకం వచ్చిందా రసరాజూ..." అని నిలదీసి అడుగుతూ-ఒకోసారి వాత్సల్యంతో గట్టిగా మందలిస్తూ-ఈ రసభారతి ఇలా వెలుగు చూడటానికి కారకులై "అభినందన" లందించారు జ్ఞానపీఠసరస్వతీమూర్తులు పద్మశ్రీ డా॥ సి. నారాయణరెడ్డిగారు—

నా పద్యాన్నీ, నన్నూ ఎక్కువగా ప్రేమిస్తూ - ముద్రణకు ముందే "రసభారతి"ని పరిశీలించి తగు సూచనలతో హరిత సంకేతాన్ని ఇస్తూ తమ "ఆంతర్యం" ఆత్మీయంగా ఆవిష్కరించారు ప్రముఖ చలనచిత్ర నటులు, పండిత కవులు, "కళావాచస్పతి" శ్రీ కొంగర జగ్గయ్యగారు-

ఉప్పొంగిన కవితాహృదయంతో-తొలి పరిచయంలోనే నా పద్యంపై అనురాగ పద్యసుగంధం కురిపించారు "సార్థకనామం"తో "సహజకవి" మల్లెమాలగారు-

సౌజన్యంతో ఈ కావ్యానికి ఆర్థికసహకారాన్ని అందించారు తెలుగు విశ్వవిద్యాలయంవారు -

ఈ రసభారతిలో పద్యాలను ఇంతకుముందే ఆదరిస్తూ ప్రకటించారు ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, భారతి, స్రవంతి, జ్యోతి, చైతన్యకవిత ఆదిగా పత్రికా సంపాదకులు, ఆకాశవాణివారు-

రసభారతిని సముచితంగా తీర్చిదిద్దారు - ముఖచిత్రాలంకరణతో - ప్రముఖచిత్రకారులు శ్రీ బాలిగారు. అందుకు దోహదం చేశారు "వనితాజ్యోతి" సంపాదకులు, నా ఆప్తమిత్రులు జొన్నలగడ్డ సత్యనారాయణగారు-

పుస్తకాన్ని అందంగా తీర్చిదిద్దే ప్రయత్నంలో తగు సూచనలందించారు మిత్రులు డా॥ వెలగా వెంకటప్పయ్యగారు-

అవ్యవధిలో - అందంగా - ఈ పుస్తకాన్ని ముద్రించి ఇచ్చారు యు. యస్. పి. అధినేతలు, శ్రీ మల్లిడి రామిరెడ్డిగారు—

అందరికీ నేను కృతజ్ఞుణ్ణి !...

ఇక్కడే మరో చిన్న మాట –

ఓ ప్రక్క చదువుకొంటూ - మరో ప్రక్క రసభారతి వ్రాతప్రతిని సిద్ధంచేసి ముచ్చటగా, ముద్రణకు ముందు పెట్టారు మా చిరంజీవులు కాశీ - యశోధరవర్మలు. ఇరువురికీ నా దీవెనలు ! ....

రసహృదయ నివేదనంగా - ఈ రసభారతిని మీముందుంచాను. స్వీకరించండి ! ...

—రసరాజు

# రస రేఖలు

# ర సో ప హా రం

## అమ్మ : కీ॥ శే॥ శ్రీమతి రంగినేని వేంకమాంబ

కనిపించిన ప్రతి రాయికి
ప్రణమిల్లితివమ్మ! కడుపు పండించుకొనన్;
జనయిత్రి వైతివమ్మా!
ఋణ మీగుదునే మరెన్ని కృతులర్పింపన్!

నడిరేయి దాటుచున్నను
కుడువక - కునుకైన లేక - కుర్రతలమ్మ
ల్బడిసేయుచుండ - గూటికి
సడుగిడని దినాలు జ్ఞప్తియందు చరింపన్....

తల్లీ! నిద్దురలేని కన్నుల నిశీథంబెల్ల నాకోసమే
అల్లల్లాడుచు - ద్వారతోరణమునీవై - దారులంజూచు - నీ
యెల్లల్ గీయని పిచ్చిప్రేమయది దీపించున్ సుధాజ్యోత్స్నయై;
ఇల్లాలన్నను, మాతృమూర్తివన, నీవే! వేంకమాంబాసతీ!

ఉత్తరమున్ గ్రహించి - నిను నూపిరితో తిలకింప నాన్నయున్
చిత్తము చిక్కబట్టి - నను చేకొని సాగెను; కాని, మాకు నీ
క్రొత్త సమాధి మంచుముసుగున్ ధరియించుచు నవ్వసాగె; గ
మ్మత్తు కదా! పరాత్పరుని మాయలు! అందవు లోకదృష్టికిన్!

"కొడుకా!" యంచు ప్రపంచమున్ విడచి-నాకున్ - మాతృశబ్దంబు నా
మడ దూరంబుగ జేసిపోయితివి అమ్మా!.... లేదు సత్యత్వ మీ
పుడమిన్ తల్లులుగల్గు పిల్లలను; దేవుండైన నెట్లోర్చెనో
కడచూపైనను దక్కలేదుకద! దుఃఖంబెల్లు చల్లారెడిన్!

శ్రావణపౌర్ణమాసితిథి స్వాగతముం బలుకంగ, నాకు నీ
దీవెనలవ్ మిగిల్చి చనుదెంచితివా జననీ : అవేకదా
తీవలు సాగె నేడు - విడదీయని నీయనురాగమూర్తి కే
సేవలు సేతు నేను - విరచించిన కావ్యమొసంగుటల్ వినా !

ఎవరైన నను కోపగించిన - నా పూట
మెతుకు ముట్టని పిచ్చి బ్రతుకునీది !
ఎపుడైన రొంపతో నెగచిన - దిగులుతో
దీనమై సగమైన మేను నీది :
ఎపుడైన పొరుగింటికేగ - వచ్చేదిదాక
ఎదురుతెన్నులు జూచు యెడదనీది :
ఎపుడైన మారాము నేసేయ - అందులో
గెలుపెరుంగని గొప్పవలపునీది :

అవును మరి : లేకలేక నీ అంతరాత్మ
జీల్చి - వచ్చిన ప్రేమరాశిని కదమ్మ !
కంటిరెప్పగ నను చూచుకొంటివపుడు !
ఇపుడు నను గాచుచుండె నీ యెడదతీపి !

అమ్మా : నీ యనుగుం గుమారుడను - స్తన్యంబిచ్చి - నాలో కవి
త్వమ్మున్ నింపితి; ధన్యుజేసితివి; కావ్యశ్రీని నేడిట్లు - ప్రే
మమ్మేపారగ నంకితంబిడితినమ్మా నాన్నకున్ నీకు - శ్రే
యమ్మున్ గూర్పుడు దీవెనల్ పలికి; ... ఆహ్వానంబు గైకొండిదే !

## నాన్న : కీ॥ శే॥ రంగినీని కాశిరాజుగారు

పేదరికమ్ము బెబ్బులిగ పీలిచి పిప్పియొనర్చువేళ - ని
ర్వేదము పాలుగాక నడిపించిన సాహసజీవితాన - నీ
వేదిన మాత్మగౌరవమొకింతయు బీటలువోవనీని హుం
దా దరిసించినాడను పితా ! ... నతులందుమివే సహస్రముల్ ।

బురఖాలేని మొగమ్ముతో నడచి - డాబున్, దర్పమేలేని - ఆ
చరఖాయోగి పథమ్ములో చివరిశ్వాసన్ వీడునందాక ఖ
ద్దరునే దాల్చి - విశాలమైన హృదయౌదార్యంబు గాన్పింప - నె
ల్లరకున్ స్వాగతమిచ్చినావు జనకా!... శ్లాఘ్యంబులీవృత్తముల్ ।

అలనా డన్నయు, బందుగుల్, భజన లభ్యాసించుచున్ - నాల్గు గో
డల మధ్యమ్మున; క్షుద్రుడైన నిను గెంటంద్రోయగా - గోడ తూ
ములలో కన్నులు నిల్పుచున్, పదగతుల్ ముద్రించు కొన్నా - వదే
కళలోనే గురువైతివా - జనన సంస్కారంబులే ఇట్టివా ।

నాయన ! నీచరిత్ర మభినందనపాత్రము ! సత్కళావ్రతుల్
"గాయకరత్న" వంటి కథకప్రముఖుల్ భవదీయమౌ నభి
ప్రాయములన్, విమర్శనములన్ గ్రహియించిరటన్న నీకళా
స్థాయి యదెట్టిదో ! జనని సల్పిన తొల్లిటి పూజలెట్టివో !

ఏమి తపస్సు చేసితివొ యేమొ - జగద్గురువౌ మెహేరుబా
బా ముదమార నీ చరణపద్మములన్ గడిగెన్‌గదా ! మహా
త్మా ! మును వాసవీ నిలయమౌ పెనుగొండ పురాన; కల్మియే
లేమిని కౌగలించుకొనె! లేవిటువంటి కథావిశేషముల్ !

నీసతి కాలవార్ధిని మునింగిన పక్షమునందె అంతిమ
శ్వాసను వీడె నీ జనని; శాపమిదెట్టుల మోసినాడవ
య్యా! సృజియించినట్టి పరమాత్మునకైన దయార్ద్రదృష్టి లే
దా! సెగరేపి నవ్వుకొను తత్త్వము దేవునకెట్లు కల్గెనో!

అమ్మ గతింపగా - సవతియమ్మకు స్వాగతమీయకుండ - ప్రే
మమ్మున వండి వార్చి - రసమాధురి దన్పుచు - తల్లిలేని నా
యుమ్మలికమ్ము దీర్చితివహో! జనకుండవటన్న నీవె! ప
ద్యమ్ములనెన్ని చెప్పిన కృతజ్ఞుడనై ఋణమీగ నేర్తునే!

చరితార్థమ్ములు నీవిశేషములు, వాత్సల్యమ్ములున్ తండ్రి! "నా
మరణానంతరమందు పద్యముల నెమ్మామ్మిడ్కన్ నిబంధింతువో
యెరుగంజెప్పుచు గోర్కెదీర్పుమిపుడో యేకైక పుత్రా!" యట
న్న రసార్ద్రంబులు సన్నివేశములు నాన్నా! జ్ఞాపికాదీపికల్!

నా పద్యాలను గుండెకత్తుకొని ఆనందాశ్రుషల్ నించు - నీ
నేపథ్యమ్మును నేను చూచితివి తండ్రీ! గర్వమేలేని నీ
రూపంబారినవెన్క నాకవనమూర్తుల్ పెన్నిధానంబులై
నీ పక్కన్ తలదిండుక్రింద కనిపించెన్ - చాలు! ధన్యాత్ముడన్!

ఈ రసభారతీకృతి గ్రహింపుడు మీరును - అమ్మగారు - నా
కోరికతీర; మీ కుసుమకోమలమైన యెడందకున్ నమ
స్కారము! స్వర్గలోకమున కాపురమున్నను వేగవచ్చి - ఆ
శీరమృతమ్ము నాపయిని జిల్కుడు మంగళదేవతాకృతిన్!

— రసరాజు

# అంజలి

శ్రీలక్ష్మిని కలిగియు — భో
గాలను తూగాడవీవు - గరికలు, కుడుముల్
చాలును - పాఠమిదే వి
ద్యాలయమున నేర్చుకొంటివయ్య గణేశా !

వేలుపు బిండుగావ - నరివీర భయంకర రూపధారివై
కూలిచినాడవా గజముఖుండను దైత్యుని; నాటినుండి గుం
జీలను తీయుచుందురట జేజెలు నీకడనిల్చి - భక్తిభా
వాలు సుమింపగా;.... భువన వంద్యుడవీవు వినాయకప్రభూ !

"భూవలయంబు చుట్టి మునుముందుగ వచ్చినవాడె జెట్టి ! మా
భావనలో" నటంచు శివపార్వతులాడగ - స్కందుడున్ జయ
శ్రీ వరియింప నెమ్మిపయి శీఘ్రముగా నరుదెంచె - కాని, మే
ధావివినీవు; వారికె ప్రదక్షిణసల్పి విజేతవైతివే !

భారతమున్ రచించు తరి-వ్యాసుడు - వ్రాయసకానిగా నినున్
గోరుటయే భవత్ప్రతిభకున్ గురుతైనది; నాడు నీ వసా
ధారణమైన త్యాగమున దంతములాగి లిఖింపకున్నచో
భారతమీ జనావళికి పంచమవేదముగా లభించునే !

ఆ పరమేశ్వరుండె త్రిపురాసురభంజనవేళ నిన్ను దీ
క్షాపరతంత్రుడై కొలిచి - జైత్రవిభూతిని దిద్దుకోగ - స్వా
మీ! పెరవారి సంగతులికేల? భవన్మహిమంబు దెల్ప వే
రే పరిభాషలేల?.... భవదీశ్వరశక్తికి నంజలించెదన్ !

ర స రా జు

# శ్రీకృష్ణదేవరాయలు

గంటమూనినచాలు - కవితాసరస్వతి
కావ్యరూపమున సాక్షాత్కరించు!
ఖడ్గమెత్తినచాలు - కాళికాదేవి పీ
రావేశ మొప్పగ నావహించు!
వీణమీటినచాలు - విమల గాంధర్వమే
ఆకృతి వహియించి యంజలించు!
దండమంటినచాలు - ధర్మదేవత లేచి
నాల్గుపాదాలతో నడచివచ్చు!

ఎవనికీ పేర్మి కలదు మహీతలాన
కృష్ణరాయాగ్రణికి గాక; కీర్తిలోన
స్ఫూర్తిలోనను, కందర్పమూర్తిలోన
దేవరాయలకంటె పార్థివుడెవండు?

# బ్రౌను దొర

ఓ రసరమ్యమూర్తి! భరతోర్విని - ఏ సుముహూర్తమందు నిం
పారగ పాదమూనితివొ - ఆంధ్రసరస్వతి పాదపద్మ మం
జీరము ఘల్లుఘల్లన ధ్వనించెను - క్రొమ్ముడిలోన ముద్దమం
దారము నవ్వుకొన్నది - ఘనంబుగ కచ్ఛపి మ్రోగె నద్దెసన్!

బ్రౌనుదొరా! మహాత్మ! అభివందనమయ్య! తెలుంగుసాహితీ
వాణికి నర్చనల్ సలిపి పండిన ధన్యుడవీవు! ప్రాజ్ఞస
న్మానములందుకొన్న మతిమంతుడవీవు! మరేల! తెల్గుమా
గాణములందు వెన్నెలలు గాసెనహో! భవదాగమంబుచే!

బ్రౌనుదొరా! మహాత్మ! రసబంధుర మాంధ్రకవిత్వ సుందరో
ద్యానవనంబులో నొదిగి - హాయిగ - కావ్యసుమాలలోన - పూ
దేనెను గుండెలంటగను తృప్తిగ త్రావిన మేటితేటివి
వై - నవరాగమాలికల నల్లితివయ్య రసోచితంబుగన్!

తెనుగున తేటతెల్లముగ తీయని సూక్తులు చెప్పినట్టి "వే
మన శతకంబు" నెల్ల ప్రథమంబుగ నాంగ్లమునందుకూర్చి - వే
మనకు కవీంద్రలోకమున మాన్యతనిచ్చి - జగాన తెల్గు వె
ల్గును బచరించినట్టి రసలబ్ధుడ! నీ కృషికిం జిరాయువుల్!

తాటియాకులలో తలదాచుకొన్న
వెలుగుచూడని కావ్యాలు వెలికితీసి
ముద్రణానందమును గూర్చి - పులిసిపోని
దివ్యరసభిక్ష నందించితే మహాత్మ!

తెలుగును నభ్యసించెడి విదేశనివాసుల - కాంగ్ల భాషపై
వలపుగలట్టి తెల్గులకు - వారధి కట్టగనూహజేసి - అ
గ్గలమగు పాటుకోరిచి - నిఘంటువులన్ రచియించి - రెండుభా
షలకు మహోపకారమును సల్పితివయ్యా! కళాభివాదముల్!

ఎనుబదియారబ్దంబుల
మనుగడలో - సర్వదేండ్ల మనికిని సర్వం
బును తెలుగుకొరకు వెచ్చిం
చిన ఘనుడవు! నీ ఋణంబు చెల్లునె మాకున్!

నిక్కముబల్క నన్నయవు నీ - వితరుండవు కాదు! కానిచో
ఎక్కడ రాజమహేంద్రి? మరి యెక్కడిదయ్య బ్రిటీష్ పురంధ్రి? నీ
విక్కడ పెక్కుమార్లు వసియించి - తెలుంగు వెలుంగువైతి, వా
మక్కువకర్థమేమి చెపుమా!.... కవినై నిను పృచ్ఛచేసెదన్!

తలపన్ తెల్గుకవుల్ బుధాగ్రణులు సత్కారంబులన్బొంది, వం
దలు వేలున్ గ్రహియింప బ్రోచితివి! నిద్రాక్షీణంబులై యున్న అం
ధ్రుల సారస్వత జీవితమ్ములను మేల్కొల్పంగ యత్నించి - ని
ష్ఠుల మౌ కీరితినందుకొంటివి - నమస్సుల్ బ్రౌను విద్వన్మణీ!

తెలుగుపొలముల కలికి వెన్నెలలు పండె
కాటను మహానుభావుని కారణమున;
తెలుగుసాహిత్యకేదారములు ఫలించె
నీ కతాన; మీరిరువురే మాకు దొరలు!

తెనుగుభాషకు నాంధ్రమున సమగ్రంబైన
వ్యాకరణగ్రంథ మవతరింప -
చక్కని వ్యాఖ్యాన సరణి నచ్చయి, మను
వసుచరిత్రాది కావ్యములు దనర -
పరదేశముల తెల్గుభాషా సరస్వతి
విజయగీతిక లాలపించి వెలయ -
తెలుగు వాచకములా, తెలుగు వ్యాకరణమ్ము
భాషాభివృద్ధికై పరిఢవిల్ల -

ఏ మహాత్ముడు కృషిసల్పి - హృదయసీమ
లేలుకొనగల్గె - నాటికాశీలివీవు!
తెలుగు వెలుగున కొక వన్నె దిద్దినట్టి
బ్రౌనుదొర పండితాఖండలా! నమోస్తు!

# జీవనగీత

బ్రతుకుబాటలో కంటకాలను తలంచి
మడమదిప్పుట ధీరుని మతము కాదు-
పొంచి నిలిచిన కంటకమ్ములకు నడుమ
శీర్షమెత్తు గులాబిదే జీవితమ్ము ।

బ్రతుకొక యగాధమైన సంద్రంబటంచు
వేదినిట్టూర్పు విడచుట వెర్రితనము-
ఆ యగాధ సముద్రమ్మునందు కలవు
రత్న దీపాల దరహాసరాగరుచులు ।

బ్రతుకు, మోడువారినదంచు వెతనుజెంది
హృదయమును చంపుకొనుటది హీనమగును-
బ్రతుకు ఋతుచక్రమున శిశిరమ్ము తొలగ
ఒక్కనాడు వసంతమే రెక్కవిప్పు।

బ్రతుకు - చీకటిరాత్రిలో వాడెననుచు
దిగులు చెంది నిరాశతో తిరుగవలదు
నల్లని యమాస విడిన యనంతరమున
ఆకసమునందు నెలవంక యవతరించు ।

బ్రతుకుకొలనులో బురదకు భయముజెంది
పారిపోవుట విజ్ఞుని పథముకాదు-
పంకమునుదాటి తావిని పంచగలుగు
పద్మకాంత హసించు-రేపటిదినాన ।

# ఉ గా ది

తెగిపడినట్టి తంత్రులను తీర్చి—శ్రుతుల్ సరిచేసి పల్కు— సో
యగము వెలార్ప రమ్మిదె నవాబ్దము ! నీ మధుగాన వాహినిన్
జగతి పునీతమై—ఉదయ సంధ్యకు హారతులెత్తు! హాయిగా
ప్రగతిపథాలపైన పదపద్మములూని సుఖింతురెల్లరున్ !

మొలచిన ముండ్లచెట్లను సమూలముగా పెకలించి—పూల మొ
క్కలు నెలకొల్పి—జాతికి సుగంధము పూసి—చరిత్రలోన వె
న్నెల గురిపించుమమ్మ—అవనీతలమెల్లను నీకు స్వాగతో
క్తులు వినిపించు చున్నదదిగో ! దయసేయుము నూత్నవర్షమా !

పసుపుపచ్చని ద్వారాలపైన - అదిగో
తోరణ వ్రాత మట్టిటు తూగి నిన్ను
పిలుచుచున్నది - గుండెల తలుపులన్ని
తెరచి; మేలుగూర్పగరాగదే ! " ఉగాది " !

# సాహితీవిశ్వనాథుడు

ప్రవిమల కల్పవృక్షఫలరాజము నాంధ్రులకిచ్చినట్టి గౌ
రవమది నీకుదక్కె కవిరాజ ! మహాంధ్ర కవిత్వమందునన్
వివిధములైన ప్రక్రియలు నీవలె తీర్చినవాడు-సత్కవి
ప్రవరుడొకండు కల్గెనె !.... పురాకృత పుణ్యమటన్న నీదెయౌ !

"కిన్నెరసానిపాట" బ్రతికించు నినున్-"నవలా" జగత్తులో
కన్నదివోలె "వేయిపడగల్" నినుగాచును-"కల్పవృక్ష" మ
త్యున్నత పీఠమేర్పరచు-నూహలకందనివీ యదృష్టముల్ !
నన్నయవో ! మహాంధ్రకవనంబున కన్నయవో ! ప్రణామముల్ !

తెలుగు కవితా సతిని-కీర్తి తిలకమద్ది
జ్ఞానపీఠమ్ముపై నిల్పినావు సుకవి !
సాహితీ విశ్వనాథ ! రసజ్ఞులెసగు
రాజ్యమేలుము-కొనుము నీరాజనాలు !

# భగ్నజీవి

అతఁడొక పిచ్చివాఁడని-దయారహితాత్ముఁడవౌచు మానవీ
యత విడనాడి నీవు పరిహాసము చేయకు-జీవితమ్ములో
చితికిన గుండెతో సతము చేదును మేయుచు-వెర్రిమొర్రిగా
బ్రతికెడి భగ్నజీవికొక బాష్పకణమ్మిడు మార్ద్రచిత్తతన్!

ఏ చపలాక్షికో మనసునిచ్చి-సమస్తజగంబు నామెలో
జూచుచు-స్వప్నమాధురుల జొక్కుచు-జీవితమెల్ల యాసకై
వేచి-రసోదయమ్ము కనిపింపక-నాశలడంగి-నేడిటుల్
బూచివలెన్ వికారరూపమును బొందెనో! దైన్యము తాండవింపగన్!

రాలను రువ్వ-వాని యొడలన్ దయమాలి సృజింపకోయి గా
యాలను-వాని భగ్నహృదయంబది ఎప్పుడొ రక్తసిక్తమై
చీలెను-వాని దైన్యమగు జీవితమంగని, తోచినంతలో
జాలివహింపు-మాతని విషాదము తీర్పగలేవు నీవెటుల్!

అతఁడు శప్తజీవి-మధురామృతమేదో, విషమ్మదేదొ తే
డా తెలియంగలేఁడు-కపటంబు నెరుంగఁడు-మాయయున్, దగా
చేతులు కల్పనట్టి రససిద్ధిని పొందిన యోగిపుంగవుం
డాతఁడు-వానితోడ పరిహాసములా! తగదోయి నీకికన్!

కిలకిల నవ్వునొక్కపరి-ఖిన్నముఖంబును జూపు కొన్ని వే
ళల-పరువెత్తునొక్కయెడ-రాయివలెన్ నిలుచుండు కొన్ని మా
రులు-మనసైనచో కరములుంజతగూర్చి హుషారుతోడ ది
క్కులు చలియింప కేకిసలు కొట్టు-విచిత్రములా విధానముల్!

మాసినగడ్డ-మాపయి ని మానముగప్పని గుడ్డ-ధూళితో
ధూసరమైన యామొడలు-దోయిడి చూపులు-రంగుమారి, దు
ర్వాసనగొట్టు తైలమునురాయనిజుట్టు-విధాత ఎంతగా
మోసముచేసెనో-బ్రతుకు మోళ్ళిడయి మాడె వ్యధాగ్నికీలలన్ ॥

అతనికి గమ్యముంగల ప్రయాణముతోచదు-కాలికెద్ది స
మ్మతమగునో అదే అతని మార్గము-బస్సుల వేళ, రైలు సం
గతులు తలంపబోవడు-జగమ్మునకల్గు హడావిడుల్, విధుల్
వెతికిన వానియందు కనిపింప-వలౌకికమా ప్రవృత్తులన్ ॥

మతముల మత్తు-పైసల ప్రమత్తత-వట్టి బడాయి వేషముల్
మతకరి చేష్టలేవియును మచ్చునకైనను గానరావు-ఆ
గతము, ననాగతమ్మొకటిగా-తలపోయు సమానదృష్టి-ఏ
మతలబులందు వానికభిమానము లేదు-హతాశుడన్నిటన్ ॥

చింతలెరుంగబోవని విచిత్రతపస్వి-నిదాఘమైన, హే
మంతమునైన వానికి సమానమె-స్వర్గము-నారకమ్ము లా
వంతయు పట్టవాతనికి-నబ్బురమై కనిపించు క్రొత్తవే
దాంతి యతండు-భూమిపయి దాల్చెను రూపము పిచ్చివానిగా ॥

తప్పుల నొప్పులం దెలియదగ్గ విచక్షణలేనివా-డతం
డెప్పుడు నిద్రపోవునొ-మరెప్పుడు మేల్కొనునో మహేశుడే
చెప్పగలేడు-జీవననిశీథములోపడి పాపమెప్పుడో
తప్పెను దారి-ఆశలను తారకలే కనిపింపవెప్పుడున్ ॥

# స్వేచ్ఛా ప్రభాతం

అన్నదమ్ములు హాయిగా ఆడుకొనిన
పొరుగువానికి బుర్రలో పురుగుపుట్టు-
ఒక ప్రశాంత సరస్సులో- ఒడ్డు నుండి
రాయి విసరుట కొందరి ధ్యేయమగును!

"సిక్కుముడి" వేసి, ఇంటిలో చిచ్చుపెట్టు
నిప్పులున్నవి ఈపక్క నివురుగప్పి;
నీళ్ళనీళ్ళని పెట్రోలు చల్లు-పెద్ద
బుర్రలున్నవి ఆప్రక్క పొంచిపొంచి;

చక్కని కుటుంబమేదైన ముక్కలైన
ఎంత దైన్యము .. ఇతరులకెంతయలుసు?....
సమత నిర్మించుకొన్న స్వేచ్ఛాగృహమ్ము
చిన్నబోయినచో-ఎంత సిగ్గుచేటు!

మతములేవైనకాని - సమానదృష్టి
నిలిపినప్పుడె-మనిషి-మనీషియగును!
మతము ముసుగున రక్తపు మరకలున్న
మానవుడు కాడతడు - పచ్చిదానవుండు!

ఎన్ని యువ "భరత్‌సింగ" మ్ము-లీ పవిత్ర
జాతికొనాడు స్వేచ్ఛాప్రభాతమిడగ -
లీవి నురికంబములకేగి జీవములను
ధారవోసెనొ!.... తెలియనిదా! చరిత్ర!

# అద్వైతం

హనుమన్నా! కనలేదు నీకు సరియౌ ఆరాధ్యభక్తాగ్రగ
ణ్యుని వేరొక్కని నేటికిన్: యుగములెన్నో కాలగర్భంబునన్
మునుకల్ వేసెనుగాని - నిన్నెకనినే పూజార్హుడౌ రామభ
క్తునిగా నాదలదాల్చు లోకములు! హద్దుల్లేవు నీభక్తికిన్!

మును సీతావనజాక్షి నీకొసగగా ముత్యాలహారమ్ము-కై
కొని-ముక్కల్ పొనరించి-రామునట కన్గోయత్నముల్ జేసి-నీ
ఘనమౌభక్తి వెలార్చినాడవట-తారాగణంబులేలా! జగ
త్తున నిర్మించిన రామభక్తుడు "నభూతో...." ఆంజనేయప్రభూ:

ఎవరిని విశ్వసించి-స్మరియించుచు జీవనయాత్ర చేయుచుం
టివో సతతంబు-తాదృశగణేయుని రామునెదిర్చి పోరు స
ల్పవలసి వచ్చినప్పుడెటువంటి వ్యథన్ బడినావో! గుండెలో
నవిసిన యగ్నిపర్వతములన్నిటినెట్లు భరించినాడవో!

"పెరవారెవ్వరు చోటుచేసికొను హృత్పీఠంబు కాదిద్ది -ఇ
ద్దరు నన్గన్న పవిత్రమూర్తులగు సీతారాములే యుందురిం
దరయన్-గాంచు!" డటంచు గుండెలను వ్రయ్యంజేసి నీభక్తికిన్
సరిలేనట్టి యుదాహృతిన్ నిలిపితే! సామీరి! నిన్ గొల్చెదన్!

ఎచట రాముడు కలడో - నీ వచట కలవు!
ఈ వెచటనున్న-రాముడయ్యెడనె కలడు!
రాముడే నీవు - నీవె యా రాముడగుచు
ద్వైతమున పాడుకొంటి వద్వైతగీతి!

# దీపలక్ష్మి

ద్వారబంధాలపై తోరణమ్ములు కట్టి
 స్వాగతంబనిన లాభంబులేదు !
వెండిపళ్ళెరమందు పిండివంటలుపెట్టి
 అతిధ్యమనిన సంప్రీతిలేదు !
దివ్వెలతోటలో పువ్వులు పూయించి
 సత్కారమనిన హర్షమ్ములేదు !
వైభవంబీనగా బాణసంచా కాల్చి
 కనులవిందనిన సౌఖ్యమ్ములేదు !

ముందు - మీగుండెలందున ముసురుకొన్న
కరడు కట్టిన కటికి చీకటుల దునిమి
వెలుగు జెండాలు నెత్తు-డవ్వేళ నేను
" దీపలక్ష్మి "గ మీయింట తేజరిలుదు !

# అల్లూరి సీతారామరాజు

భారతవీరనారి ముఖపద్మముపై ఎవరామనీషి సిం
దూరము దిద్దుచుండెను?.... తెనుంగు ధరిత్రి కనుంగుబిడ్డ "అ
ల్లూరి" నృసింహమా? ప్రణతులో సమరాంగణ సార్వభౌమ! మా
హారతులందుకొమ్ము! శుభమస్తు! జయధ్వజమెత్తుకొమ్మికన్!

నీరము ముట్టలేదు - మరి నిద్రకు నోచుకొనంగలేదు - తం
డ్రీ! రవియస్తమించని బ్రిటీషుప్రభుత్వము దద్దరిల్లె - నీ
పేరు తలంపగా! తెలుగువీరులకే తలమానికంబు నీ
కీరితి - విశ్వలేఖిని లిఖించెనులెమ్ము భవత్ప్రతాపముల్!

నీగడియారమందు రవి నిద్దురచెందిన జాడలేదు - మి
న్నాగువలెన్ చరించితి వనారతమున్-దొరలెల్ల పన్ను ప
న్నాగములన్ గ్రహించితివి! నాయకలక్షణమన్న నీదెరా!
భాగములేదు నీయశము ప్రక్కన వేరొకవ్యక్తికెన్నడున్!

"ఇమ్మహి పంచభూతములకెల్లరు వర్షులు-దానిలోన భే
దమ్ములు, రంగురంగు పరదాలనుగాని కనుంగొనంగ మృ
గ్యమ్మెవడబ్బసొమ్మొ, పరమాత్ముడొసంగిన సృష్టిలోన భా
గ్యమ్మను దోచువే"! యనుచు గాండివమెత్తిన వీరుడీవహో!

కకవికలయ్యె నీ "మిరపకాయటపా"కు బ్రిటీషుసింహ పీ
ఠిక-పదివేల కాన్క ప్రకటించెను నిన్గని పట్టితెచ్చువా
రికి-తెలవారి పప్పుడకలేదపుడై నను-సాధ్యమౌనె శూ
లికి నెదురేగి నిల్చుట?.... ఫలింపవు కాపురుష ప్రయత్నముల్!

"వీరుని తల్లివీవు! విలపించుట ధర్మము కా" దటంచు-నో
దారిచి మాతృదేవిని-స్వతంత్ర మహారణరంగమందు-నో
రార" స్వరాజ్యమా! బ్రతుకుమా! యనుచున్ కడసారిపల్కి-ప్రా
కారము నీ యశస్సునకు గట్టితివయ్య సురక్షితంబుగన్!

పోలీస్ స్టేషను దోచుకొందు నని మోమాటమ్ము లేకుండ-ముం
దే లేఖాముఖతన్ వచించు మొనగాడెవ్వాడు నిందన్న- నీ
నేలన్ బుట్టిన దాఖలాలసలు లేనేలేవు-నీరక్తమం
దే "లావా" ప్రవహించెనో! బెదరిపోయెన్ శ్వేతసామ్రాజ్యముల్!

కావరమెక్కి-సేవకుల గాళ్ళను దన్నుచు-బట్టలూడ్చి-మ
ర్మావయవాలలోన కుటిలాత్ములు కారము జల్లినప్పుడెం
తో వెతజెంది నీ హృదయదుర్గము బీటలువారె-నందుకే
నీవు త్రినేత్రమూర్తివయి నిప్పులు గ్రక్కితి వాంగ్లజాతిపై!

ఏలికలై -సహింపని యకృత్యములంబొనరించి-మానభం
గాలొనరించినన్ జన నికాయము నీయునికిన్ రవంత యే
లీల వచింపలేదు! భళిరే! అది యెంతటి స్వామిభక్తి! ఏ
మూలకు వచ్చు మ్లేచ్ఛుల ప్రభుత్వము నీ భుజశక్తి ముంగిటన్!

భీతిలి యెంతకాలమిక స్వేచ్ఛకు దూరముగా వసించు, ట
జ్ఞాత తమస్సులో దినదినమ్ము గతించుట! మొక్కవోని వి
ఖ్యాతిని జాతిపాడుకొనగా తనువున్ బలిచేసి-విప్లవ
జ్యోతిగనిల్పి సుస్థిరతనొందితివీ వవిరా చరిత్రముల్!

ఇరువదియేడు వర్షములకే తలవాల్చితివా మహాత్మ! భా
స్కరుడొక కేతుకంఠమున శాపవశమ్మున గ్రుంకినట్లు; పం
జరమును వీడి–నేడు–మనజాతి విహంగము గొంతువిప్పి నీ
చరితము పాడుచున్నదిదె! స్వర్గములో చెవియొగ్గి వింటివా!

తెల్లదొరలకు పక్కలో బల్లెమగుచు
తేజరిలిన "సీతారామరాజు" వీవు!
కనులు మిరుమిట్లుగొల్పు జీవనముచేసి
మించుతీవగ తనువు చాలించినావు!

చీకటి తలదన్నెడి యా
వేకువవలె దూకినావు–విజయశ్రీ బం
ధూకమ్ములు నీ వెలుగున
రేకులు విప్పుచును తేజరిల్లె మహాత్మా!

# అభిశంసనం

ఇది ధర్మం-బిది ధర్మబాహ్యమని-యొక్కింతేని యోచింప, కె
య్యదియో నేరము మోపి-కిన్క నిపుడాహావంబు కేతెంచు-నీ
కద లాశాంతములంట ప్రాకినవి-మూర్ఖత్వంబు మిన్నంటగా
హృదికిన్ దోచనె మంచిచెడ్డలు! అయూబేమాయె వీక్షించినన్!

మంచికి ప్రాణమిచ్చి యభిమానము జూపెడి జాతిలోన జ
న్మించిన భారతీయులము మే-మవినీతి మరెక్కడున్న శో
ధించి-దురాగతాల తెరదించి-మృగత్వము ద్రుంచి - త్రిప్పి పం
పించెడి జాతిమాది - తెరపించునులే భరతోర్వి నీకనుల్!

మడమం ద్రిప్పని వీరసింహములు జన్మంబందెనిచ్చోట-ఎ
క్కడ దౌష్ట్యంబు శిరస్సునెత్తుచును ఘీంకారించునో-అక్కడే
పిడుగై ఒక్కొకడుగ్రుడై యురికి-దీపింపంగ ధర్మంబు-ప్రా
మిడి ఛేదించుచు-వెల్గునిచ్చెదరు సుమ్మీ! జైత్రయాత్రాపథిన్!

పాకిస్తాన్ పతనంబు జెందుటకు క్రవ్యాదుండు "యాహ్యా" యొకం
డే కర్తృత్వము దాల్చెనంచు యుగముల్ నిందింపగాబోలు-సు
శ్లోకశ్రీయగు భారతోర్విపయి కాలుందువ్వినావోయి-మి
థ్యా కార్యంబును జూపి నేడిటు-చరిత్రన్ దాగిపోదెద్దియున్!

విద్యాదానమొసంగు నొజ్జలు-మహావేదాంత పారీణులున్-
హృద్యంబౌ కవనంబులల్లగల సాహిత్యస్వరూపుల్-ప్రభు
త్వోద్యోగుల్-ప్రజ-లెందరెందరని నీ యున్మాదతంత్రాన-నై
వేద్యంబై నశియించిరోకద! మురబ్బీ! బాంగ్లదేశమ్మునన్!

# సంక్రాంతి

పచ్చచేమంతు లొకప్రక్క – బంతిపూలు
మరియు నొకప్రక్క – స్వాగతసురభిళాలు
హృదయపూర్వకముగ నివేదించుచుండె-
అందుకొనుమమ్మ సంక్రాంతి! స్వాగతమ్ము

చలికి వెరవకు! భోగిమంటలను కూర్మి
సిద్ధపరచిరి చిన్నారి చిట్టిపొట్టి
పిల్లకాయలు – వారితో నుల్లమలర
రేగుపండ్లు తినుచు చలికాగువమ్మ!

తలుపుప్రక్క – సిగ్గుముసుగు దాల్చి – ప్రియుని
నోరగా దోరగా జూచు ఉవిదకనుల
వెదకికొనుమమ్మ! నీకు లభింపగలవు
మనసునలరించు నవ్యనందనవనాలు!

పిండివంటల సంగతి విస్మరించి
చీట్లపేకను దవిలి – ఖుషీవలులగు
తమ్ముగుర్రలు కన్పింతురమ్మ నీకు –
వారినియ్యెడ మందలింపకుము తల్లి!

ప్రేక్షకస్వాము లానందలీల మునుగ
పోరులో రక్తమును జిమ్మి – పౌరుషాగ్ని
నచ్చమైన వీరస్వర్గమరయు – కుక్కు-
టమ్ములకు ప్రశంసాలేఖలిమ్ము తల్లి!

## మహోదయం : ౦

## జాషువా

పుట్టిన " విన్నకొండ " కొక పూజ్యుడవై - కవితావధూటి జే
పట్టి - అమూల్య భావరసబంధుర శైలిని కావ్యసౌధముల్
గట్టి - కళాప్రపంచమున రమ్య - మహాకవితాతపస్విగా
పట్టముగట్టుకొంటివి - అపారవిశేషములివ్వి యాంధ్రికిన్ !

మును పచరించినట్టి తపముల్ ఫలవంతముకాగ - క్రీస్తు దే
వుని కథ వ్రాసి, భారత ప్రభుత్వపు గౌరవమందుకొన్న వె
ల్గును గని సంతసించెను తెలుంగుసరస్వతి - నిన్ను బోలు తీ
యని కవిరాజు కోటికొకరైన లభింతురె మాకు నుర్వరన్ !

కష్టములు కారుచీకట్లు గాండ్రుపెట్టు
దుర్దినారణ్యముల తలదూర్చి - గొంతు
వరకు విషము మ్రింగియు - నెలవంక మిసిమి
నాడుకొన్నట్టి అభినవహరుడ వీవు !

పిరదౌసీకవి నాంధ్ర పుత్రుల మనః పీఠాలపై నిల్పి - సు
స్థిరమౌకీర్తిని ముట్టజెప్పితివి - పార్శీకమ్ము యావత్తు, ని
ర్భరమౌ నీ రసదృష్టికప్పవడె - నవ్యత్వమ్ము నీసొమ్ము - త్వ
త్కరుణాజ్యోత్స్నల స్నానమాడని పదార్థంబెద్ది విశ్వంభరన్ !

స్తవనీయమ్ములుకాని గబ్బిలములున్, సాలీళ్ళు, జాకీలు, నీ
కవితావస్తువులై రసజ్ఞభువి - నగ్రస్థానమార్జించు కొ
న్న విశేషమ్ములె నీయశస్సునకు విన్నాణమ్ములై నిల్చియు
న్నవహో ! జాషువ !.... తెల్గుకైత నవపంథాతొక్కె నీలేఖినిన్ !

# మహాప్రస్థానం:

తెలుగు వెలుంగువాచు గడిదేరి - జయధ్వజమెత్తి - పండు వె
న్నెల లొలికించు పద్యములు నీదగులేఖినినుండి పంచి - గుం
డెల వశియించినట్టి కమనీయకవీశుడవీవు! మృత్యుదం
ష్ట్రల బడిపోతివయ్యయొ! కళావదనంబులు చిన్నబోవగన్!

మాటిగ హృదయమును తాకు మేటికైత
లాంధ్రవాణికి గైసేసి - యభ్యుదయపు
వెలుగులీనెడి క్రొత్త పుంతలను ద్రొక్కి-
తారవై నిల్చితే కవితారవీంద్ర!

నీ కవిత్వ లక్ష్యముజూచి ఏకలవ్యు
వైన కవికుమారులు పుట్టిరాంధ్రులందు -
కొంత మంది యసూయతో గుందినట్టి
లిప్తలును కూడ లేకపోలేదు నాడు!

ప్రాణమును బోసి - నల్లనిరంగు బూసి
వలువ మలచినయట్టి గబ్బిలముకొక్క-
చరిత సృష్టించి - కోరమీసాలు దువ్వి
విలిచినట్టి "కవిబ్రహ్మ!" గెలుపునీదె!

# వక్రించిన వర్తమానం

సదమలవృత్తిసన్నగిలె - సభ్యత మూలవడెన్ - జుగుప్స కా
స్పదమగు వేషధారణయె వర్ధిలుచుండె - వివాదదృష్టి అ
భ్యుదయముపేరు చెప్పుకొని ముందునకేగుచునుండె - మంగళ
ప్రదమగు కాలమెప్పుడిక వచ్చునొ ! జాతి పురోగమించునో !

హృదయములేని చైదములు - హేయములౌ పలుకుల్ - దురూహముల్
మదిరి చరిత్రసర్వమును ముక్కలుచేయుచునుండె - వేదసం
పదగల భూమిపై పనికిమాలిన మొక్కలు వేళ్ళుతన్ని - బె
ట్టిదముగ విస్తరిల్లుట కడింది విచారము - సిగ్గుచేటగున్ !

పచ్చని గూండ్ల జిచ్చులిడువారలు కొందరు - నాడు పిల్లలన్
బ్రుచ్చిలి, భోగవాటికల ముంగిట మానములమ్మి రీవిగా
సచ్చనగాయలాడు కుటిలాత్ములు కొందరు - దొంగనిల్వతో
హెచ్చినవారు కొందరు - జయించె పశుత్వ - మికేమి కావలెన్ !

తరతమ భేదముల్ విడచి - ధర్మము పోవిడి - తల్లిదండ్రులున్
గురువులు, బెద్దలన్న సరకుంగొనకుండగ దుష్పథమ్మునన్
బరుగిడుచున్న కాలమిది - పచ్చని తోటల కొండముచ్చు నా
గరికత కుప్పిగంతులిడి గౌరవమందుచునుండె నేడహో !

ఆర్యుల వేషభాషలకు నమ్మృతమంది విదేశవాసు లా
హార్యములాది సర్వవిషయమ్ముల నున్నతి జేరుచుండ - ని
ర్వీర్యములంచు వారిపుడు వీడిన పద్ధతులిచ్చుటన్ - శిరో
ధార్యములౌట జాతికి ముదంబగునా ! తలవంపులా కనన్ !

సమతను నిల్పి - జన్మకొక సార్థకతన్ గలిగించు భక్తిసం
ఘములు, మనోవికాససుమగంధము పూసి వెలుంగు సత్కళా
సమితులు - విద్దెలన్ గరపు సంస్థలు కూడ - దరిద్రరాజకీ
యములకు తావులై నిలిచెనక్కట! ఎంతయు శోచనీయమౌ!

ఇది పాపం - బిది పుణ్యమార్గమని యొక్కింతేని యోచింపకే
మదికిన్ దోచిన త్రోవలందు తమ నేమంబొందె కాంక్షించుచున్
పదముల్ నిల్పెడి స్వార్థశక్తుల జయధ్వానంబులెవ్వేళ బు
ద్బుదముల్ రీతి నశించునోకద! శుభంబుల్ నాడె సిద్ధించెడిన్!

సారమొకింతలేని విరసమ్మగు ప్రేమ, బజారురోడ్ల శృం
గారము పేర నర్తిలుటకంటె సమాజమునందు వేరె సం
స్కారము లేదు నేడు - పయిసా పరమాత్మ - భవిష్యకాల మే
తీరున జాతిజీవితము తీరిచిదిద్దునొ చూడగావలెన్!

ప్రాణమునిల్పు నౌషధములం గలితీ యొనరించునట్టి వి
జ్ఞానము బారసాచిన విషణ్ణదినాలివి - డబ్బుకోసమై
మానవతా సవిత్రిని సమాధిని పూడ్చుట నేర్చుకొన్న అ
ధ్వాన పరిస్థితుల్ బ్రతికిబట్టను కట్టిన, జాతినిల్చునే!

వంచనలేనిదే బ్రతుకుబాటల కాలిడలేని రక్కసుల్
మించిన దేశమందు కుసుమించునె మంచితనంబు! జాతి సా
ధించిన దేమియో తెలియదే! మనగమ్యము మారిపోయె - "వ
క్రించిన వర్తమానము" లిఖింపకపోరు చరిత్రకారులున్!

# స్వతంత్ర కేతనం

కర్తవ్యాలు లేకుండ – కాలమ్ము గాలిపి
ల్చిననాడు నేను భాసించగలను ;
మతపక్షాలడగి – సమత్వమ్ము శీర్ష మె
త్తిననాడు నేను నిద్రించగలను ;
ఆగడంబులు నాశమై – ప్రయాణము సుఖిం
చిననాడు నేను హర్షించగలను ;
మానభంగము లారి – మానవత్వమ్ము వె
ల్గిననాడు నేను గర్వించగలను ;

భరతమాతను నేను – ఉజ్జ్వల చరిత్ర
నాకు గలదు స్వరాజ్య సంగ్రామమందు;
ఎన్ని కష్టాల ఫలితమో – ఈ స్వతంత్ర
కేతనము ; బిడ్డలార ; రక్షింపుడయ్య !

# మహాత్ముడు

సమత ప్రధాన సూత్రమని చాటి - ప్రజాళిని శాంతినింపి - ఖ
డ్గములకు, నగ్గిగుండ్లకు విడాకులొసంగి - పరాయివారి స్వా
ర్థము పెకలించి - దేశము మరమ్మతుచేసి - స్వయంప్రకాశ దీ
పము వెలిగించినావు కద బాపు!.... ఋణంబెటు తీర్చుకొందుమో !

"ప్రవహించున్ బ్రతివానిలోన నొకటే రక్తంబు - అద్దానిలో
వివిధంబుల్ గలవంచు పిచ్చిపలుకుల్ విన్పించుకోవద్దు - మా
నవుడే నీవిటులన్న విశ్వమదె ఛిన్నాభిన్నమై పోదె - మా
ధవు నర్చింతువె ! తోటివానిపయి సద్భావంబు లేకుండినన్ !....

సమయము వ్యర్థపుచ్చకు - నిజంబరయన్ సగకాలమెట్లు స్వ
ప్నమునె నశించు - దక్కెడిది స్వల్పము - నీ వొనరించు మేలి కృ
త్యములు మరెన్నియున్నవో నిదానముగా పరికించుచూడు లో
కము"నని చెప్పి చేసితివి గాంధి ! మహాత్ముడవన్న నీవహో !

పరదేశంబుల కేగియున్నను, దురభ్యాసంబు లేనాడు నీ
దరికిన్ వచ్చిన జాడలేదు; శమమున్, ధర్మంబు, సత్యం, బహిం
స, రఘూత్తంసుని సేవ - నీ కివియె శ్రేష్ఠత్వంబు గల్పింప - బం
గరు సింహాసనమందుకొంటివిగదా ! గాంధీ ! ప్రజాబంధువై !

రాట్నముం ద్రిప్పి - నూలువస్త్రములు గట్టి
తలను వంచక, పగతుర తలలు దించి -
భరతజనయిత్రి పీల్చు ఊపిరుల బ్రతికి
యుంటివి మహాత్మ ! ప్రాణవాయువుగ నీవు !

నీ బోసినవ్వు - గాండ్రించు బెబ్బులిగుండె
కరగించి ప్రేమరాగమ్ము నేర్పె !
నీ యూతకర్ర - తిండ్రించు బాంబుల నోళ్ళు
మూయించి శాంతిగోపురము నిలిపె !
నీ చిన్నిపిలక - వహ్నిని గ్రక్కు టోపీల
దర్పమూడిచి సమత్వమ్ము గరపె !
నీ యంగవస్త్రమ్ము - నెరిగుల్కు పలువలన్
వడకించి దివ్యాత్మబలము చూపె !

బాపు ! నీ మహోద్యమముతో భరతమాత
దాస్యమును వీడి స్వేచ్ఛాపతాకమెత్తె !
గాంధివా ! గరుడమూర్తివో ! కన్నతల్లి
దైన్యముడిగించితివి మహాత్మా ! నమోస్తు !

# సిద్ధార్థి

బ్లాకుమార్కెట్టులో లాభాల నార్జించి
బొజ్జపెంచిన స్వార్థబుద్ధి జీల్చి
కల్తీల ముసుగులో కాసులు గడియించి
మోరనెత్తిన స్వార్థమూల మణచి
లంచాలబాటలో లాంఛనాలు గ్రహించి
బారజాచిన స్వార్థభావమార్చి
దౌర్జన్యకేళిలో ధనమానములు దోచి
జబ్బకొట్టెడి స్వార్థశక్తినూడ్చి

జాతిపిత జాతిరత్నాలు సంతసింప
నభ్యుదయపీఠమందున నధివసించి
విజయగీతికావళి నాలపింపరమ్మ!
స్వాగతమ్మిదె! సిద్ధార్థి వత్సరాది!

# నివేదన

ఏను నీకేమి ఆతిథ్య మీయగలను ?
దొరలు నానందబాష్పాలతో త్వదీయ
చరణకమలాలు మాత్రమే సంతసమున
తడుపు కొనియెద గుండెల తనివితీర !

నీవు తండ్రివి - బిడ్డను నేను; నీవు
కంటి రెప్పవు - నేనౌదు కంటిపాప;
ఆరమరికలుండ రాదిరువురకు నడుమ
కలవు నాలోన - నీలోన గలను లేను !

ఏనుఫలమైన - మధురిమ వీవయగుదు;
సౌరభము నీవయేని ప్రసవమునగుదు
నేను; నీ దయాభిక్ష లేదేని - నాకు
గలదె ఈవిశిష్టత ప్రభూ ! కలదె బ్రతుకు !

దులుపుకొని లేచిపోయెడి త్రోవలోని
బాటసారివి కావీవు ; మాటలోన
చేతలోనను, హృదిపాడు గీతిలోన
నీయడుగుజాడలెల్ల గాంచితిని నేను !

నిర్ఝరములకు మాటలు నేర్పునపుడు
పూలపెదవుల చిరునవ్వు పోయునపుడు
ప్రకృతి నేత్రాలకు నుషస్సు బంచునపుడు
నన్ను మరువకు ! నేనున్నాను స్వామి !

# దీపోత్సవం

కాంతికేతన మెత్తి - విక్రాంతిగీతి
పాడుకొను బాలసూర్యుని చూడలేక
ఇసుకలోపల తలదూర్చి - ఇరుల వెదకు
ఉష్ట్రపక్షికి బ్రతుకులో ఉదయమెపుడు ?

ప్రాగ్దిశాదేవి కాంతినేత్రాలు తెరచి
వసుధకొక చేతనాదీప్తి నొసగుచుండ
కనులు పెద్దవి కలిగి - కాంతిని శపించు
గ్రుడ్లగూబకు దీపికాలోక మెపుడు !

వెలుగు కనిపింపగా - గంగవెర్రులెత్తి
దివ్వెపై దాడిసేయ యత్నించి - తుదకు
వేడి సోకగ - మలమల మాడిపోవు
శలభమెన్నడు గ్రహియించు వెలుగువిలువ ?

వెలుగులో హాయిగా రెక్కవిప్పలేక
దీన వృత్తాంతమునకు ప్రతీకయగుచు
చీకటిని మేసి - తలక్రిందు జీవితమ్ము
గడపు గబ్బిలాయికి మరెన్నడు విముక్తి ?

చిమ్మ చీకటిలోపడి - జీవయాత్ర
నలుపుచును - కాంతి సంకేతముల నొసంగు
చిన్ని "మిణుగురు"లోన దర్శింపవచ్చు
ఒక మహాదర్శ దివ్యదీపోత్సవంబు !

# అమరజీవి

ఇది డిశంబరు పదునేను - ఇది చరిత్ర
నశ్రుధారలు కురిసిన యట్టిదినము!
తెనుగుతల్లికి స్వాతంత్ర్య తిలకమద్ది
రాలిపోయిన త్యాగి నిర్యాణ దినము!

ఇది " డిశంబరు పదునేను " - ఇది " తెలుంగు
జాతి " ప్రత్యేకతకు శసజన్మ ధార
వోసి - రాష్ట్ర భిక్ష నొసంగి - వాసిగన్న
పొట్టి శ్రీరాముని స్మరించునట్టి దినము!

ఇది " డిశంబరు పదునేను " - ఇది జనాళి
మరచిపోలేని దుఃఖసంభరిత దినము!
ప్రగతి పథముల నడిపింప ప్రాణమిడిన
" అమరజీవి "ని స్మరియించునట్టి దినము!

# తేజోభారతం

శ్రమపడి తెచ్చుకొంటిమి స్వరాజ్యపతాకము - దీనికెన్ని ఉ
ద్యమములు, త్యాగముల్, భరతధాత్రి పొనర్చి కదుష్ణ రక్తవ
ర్షము గురిపించెనో తరతరాలచరిత్రి వచించు - ఆ చరి
త్రమునకు వన్నెదిద్ది భరతద్యుతి నిల్పగలెమ్మ సోదరా!

ఒకదేశంబున పుట్టి సోదరులు వాగ్యుద్ధాలతో దేశమా
తకు గాయంబొనరించినారను చరిత్రన్ వ్రాయగానేల - గాం
ధికి, నెహ్రూల కనుంగు వారసుడవై దేశీయమేపార - జా
తికి భాగ్యోదయ జీవితంబిడుటయే ధ్యేయంబుగా నెంచుమీ!

నిను నేనున్ - నను నీవు - స్వార్థమునకై నిందించుకోజూచు వ
ర్తనమే చెడ్డది; రెండు పిల్లుల తగాదా కోతి ఆలించి, తీ
ర్చిన వృత్తాంత మెరుంగలేదా!....పరదేశీయుల్ విజృంభించి, పె
త్తనముంజేసినగాధ నేటికిని చిత్తంబందు బాధింపదే!

బురఖాలన్ తగిలించుకొంచు పలురూపుల్ మార్చుచున్ - రోజుకొ
క్క రకంబైన పదంబు పాడుచు - ప్రజాకాయంబు వంచించు ము
ష్కరు లేసీమల నుందురో - అచట అస్తవ్యస్తమై దేశ సు
స్థిర తత్వంబ అు - ఆపరివృత్తి మనకిస్సీవద్దు ముమ్మాటికిన్!

అతిసామాన్యుకుకూడ నేడు మనచర్యల్‌గాంచి, గర్హించు దు
స్థితికిం జేరెను రాజకీయములు - రాజీలేని స్వార్థమ్ముతో
చ్యుతమైపోయెను పూర్వవై భవము - తేజోవంతమైనట్టి భా
రతమిట్లుండుట మేలొకో! భరతపుత్రా! సుంతయోచింపుమా!

# నారాయణరెడ్డి

## ఆహ్వానం :

తీయని గేయమాలికలు తెల్గుసవిత్రి గళాన నింపి - " వ
హ్వా ! " యని పండితోత్తములు, పామరు, లద్భుతమంద - నూతనా
ధ్యాయము సృష్టిచేసిన మహాకవి చంద్రమ ! "సింగిరెడ్డి నా
రాయణరెడ్డి" పల్కులదొరా ! దయచేయము స్వాగతంబిదే !

## అభినందనం :

" ఉత్తరమేరికా "ను పదమూని - మహాంధ్ర సరస్వతీ గళం
బెత్తి - రసార్ద్రి చిత్తముల నేలి - యశోమకుటంబు దాల్చి - లో
కోత్తరమౌ చరిత్రపుట నొక్కటి సృష్టియొనర్చి - సాహితీ
వేత్త " సి. నా. రె." వై - తెలుగు వెల్గయి రమ్ము ! శుభాభినందనల్ !

## అభివందనం :

అతడు కళాపరిపూర్ణుడు - మహాకవి - దేశిక చక్రవర్తి - అ
ద్యతన మహాంధ్ర వాణికి నుదాహృతి - మాటల నుండి మాధురుల్
పితికిన దిట్ట; అట్టి రసరేఖ " సి. నా. రె. "(సినీరె) యాద ప
ర్వతమున సత్కరింపబడు పచ్చునివేళ కళాభివాదముల్ !

# అభ్యర్థనం

మతకలహాలలో మునిగి - మానవతాస్పృహ వీడుచున్ - సమా
నతపయి దాడిసేయు కుహనాజన సంతతికీవు సభ్య, సం
స్కృతులిడి - శాంత్యహింసలకు కేతనమెత్తి - జగాన, ధర్మ దే
వతకు చిరాయువిమ్మ ! నవవర్షమ ! స్వాగతమందు కొమ్మదే !

కష్టములెన్నివచ్చిన - ముఖంబటు త్రిప్పుట చేతకాదు ! సం
తుష్టిగ నాతిథేయమిడు దొడ్డగుణాఢ్యులమమ్మ ! మా కనా
వృష్టులు కొన్ని - అపయి శపించు తుపానులుకొన్ని - ఐన, మా
దృష్టికి వచ్చినట్టి యతిథిన్ విడనాడము ! రమ్మ ! క్రోధనా !

మోసము మిన్నుముట్టినది - మ్రుక్కిడి చేష్టలురేగె - కాపలా
కాసెడి కంటిరెప్పలె దగా యొనరించుచు కంటిపాపనే
మేసెడి దుష్టవర్తన మమేయముగా చెలరేగె - దీని కు
ద్వాసన చెప్పుమమ్మ !.... కుడిపాదము మోపుము ! స్వాగతాంజలుల్ !

మహిళను గౌరవించని సమాజము - రోదసిలోనికేగి - ఏ
గ్రహమున కాలుమోపినను లాభములేదు - చరిత్రసున్న - ఇ
మ్మహిపయి మానభంగములు మాసిననాడె ఉగాది ! ఆ ముదా
వహమగు మార్పుతెమ్మ ! నవవత్సరమా ! కవితాప్రణామముల్ !

" మమ్మీ ! డాడీ ! " యని ప్రే
మమ్మగ పిలిపించుకొనుచు - మధురంబగు ఆం
ధ్రమ్మను నిరసించెడి - ఘో
రమ్మను నీవైన మాన్పు రమ్మ ! ఉగాదీ !

సత్యము, ధర్మమన్న గురిసన్నగిలెన్ - వినయప్రవృత్తి సం
స్తుత్యము గాకపోయినది - "షో" యొకటె విలువయ్యె - క్షుద్ర సా
హిత్యము పాఠకప్రజల నేలదొడంగెను - నీ ప్రభుత్వ మీ
పైత్యము మాన్పకున్న నవవర్షమ! నిష్కృతిలేదు జాతికిన్!

ధ్వజమెత్తెన్ కద! తెల్గుబిడ్డ తనసత్తా చూపుచున్ నేర్పుతో
డ - జగంబెల్ల సలామొనర్పగను క్రీడారంగమందున్; మహా
విజయుండాతడు - వాని కభ్యుదయదీప్తిన్ బ్రేమగైసేసి - ఆ
"అజరుద్దీన్" గడియించిపెట్టిన సువర్ణాధ్యాయమున్ నిల్పుమా!

ధనమోహంబున నింటిగుట్టును సమస్తం బన్య దేశంబులం
దున స్వార్థానికి విక్రయించగల ధూర్తుల్ నేడు స్వేచ్ఛామహా
వనిలో దాగిరటన్న వార్తలకు కోపంబంది - నీ విల్లు "కోరి
ధన" వర్షంబుగ వచ్చితో! శుభము మాతా! హర్షముప్పొంగెడిన్!

రాతియుగమ్ము దాటి - నవరాగము పాడి - వికాసజీవన
జ్యోతిని నిల్పుకొన్న మనుజుండు చరిత్రను విస్మరించి - దు
ర్నీతికి నగ్నపీఠమును నిల్పుట మేము సహింపలేము త
ల్లీ! తెరవేయుమింక! తిలకింపగలేమటువంటిదృశ్యముల్!

యువజనవర్షమియ్యది - మహోన్నత లక్ష్యముతో శ్రమించి - మా
నవతకు బాటవేసి - ఒక నవ్యశకమ్మును సృష్టిచేసి - వై
భవమును నిల్పి భారతముపై - యువవాణికి చాలినంత స
త్తువనిడుమమ్మ! "అక్షయ"కృతుల్ రచియింపుము నీ హయామునన్!

# బాలలరాజ్యం

లేవు తమస్సులిచ్చట - కులీను, లహార్యులటన్న నీచమౌ
భావనలే జనింపవిట - బాలల రాజ్యము మాది - నవ్వినన్
పూవులురాలు - లేతనునుబుగ్గలు తాకిన పాలుకారు - మా
హావము, భావమున్ కవులకందని తీయని కావ్యరాజముల్ !

బులిబులి తీపిమాటలకు పొంగెద - మాక్షణమందె చీదరిం
పులు వినిపింప క్రుంగెదము - బొత్తిగ దేనికి తాళలేని పి
ల్లల - మకలంకయోగుల - మలౌకికడోలల నూగుచున్ - మహా
త్ములై చరిసించునట్టి విభుతో శిశుకేళి జరింతు మర్మిలిన్ !

చదువులవెన్ని నేర్చినను - చక్కని నవ్వులు లేవు మీకు; ఏ
చదువులు నేర్వకుండినను - చల్లగ తెమ్మెర వీచినట్లు - సౌ
హృదముగ పండువెన్నెల రహించినటుల్ - విరి విచ్చినట్లు న
వ్వెద; మది దేవుడిచ్చిన పవిత్రవరమ్ము - లభింపదేరికిన్ !

గుడిలో దేవుని విగ్రహమ్మునకు మ్రొక్కుల్ స్వార్థులై సల్పి - ఇ
బ్బడియున్ ముబ్బడికాగ కాన్కలిడుచున్ వ్యాపారముంజేయు మీ
కడ శుద్ధంబగు భక్తియెక్కడిది ? నిష్కామమ్ము మాభక్తి - ఏ
అడుగుందీయకయే హృదంతరములందర్చింతు మాదేవునిన్ !

మీలో మీకు నసూయయే - పరహితమ్మే లేదు - పైమెట్టుపై
కాలున్ మోపినవాని జూచినను - దుఃఖంబేర్పడున్ - సంతసం
బే లేశంబునుకూడ కన్పడదు - మాకీ క్షుద్రమైనట్టి భా
వాలే కిట్టవు - మా ప్రభుత్వమున దైవత్వమ్మె దీపించెడిన్ !

# కాంతిపర్వం

ఒక దురాచార సంస్కృతికూగిపోయి
తిమిరమును చీల్చి కాంతిసందేశమిచ్చి
ఎత్తు కెడిగిన జాతికా ఈ చరిత్ర ?....
"సహగమనచర్య" రాక్షసాంశకు ప్రతీక!

తలలు బ్రద్దలుకొట్టి రక్తమును త్రావి
మానవతపైన దోనెడు మన్ను చల్లి
బ్రతుకు సాగించు నరకుని వర్గమునకు
ఎప్పుడో చావుదెబ్బ ? ఊహించలేము!

నరకుడనువాడు ఎక్కడో నక్కలేదు -
మనసులో చిమ్మచీకటి మసలు చోట
వానికున్నది యునికి - అద్దాని తెలిసి
ఎవడు జాగ్రత్తపడునో - వాడే నరుండు!

ప్రమిదయున్నది - తైలంబు, వత్తికలవు -
అగ్నియున్నది గుప్తమై - అదియెరింగి
దివ్వె వెలిగింపగా ప్రయత్నించని - అవి
వేకికెన్నడు తెలియును వెలుగు విలువ ?

వెలుగు ప్రసరించు తావును విడిచిపెట్టి -
వెనుక - క్రీనీడనాడు ప్రవృత్తి కింక
తెరపడునో! లేదో!.... నరకుడు నరునిగుండె
వదలునో! వదలడో! కాంతిపర్వమెపుడో!

# మిర్జా గాలిబ్

కవితాగోష్ఠులలోన పాల్గొని - రసోద్గారంబుగా కావ్య వ
స్తువులన్ శ్రోతల గుండెలందునిచి - ఉర్దూసాహితీ విశ్వమే
హవణిల్లన్ - సభలూగిపోవుచు "వహావ్వా!" యంచు హర్షింపగా
స్తవనీయండయి నిల్చినట్టి కవి మీర్జాగాలిబున్ గొల్చెదన్ ‖

"ఇతరులు బిచ్చమెత్తుట సహింపదు నామది - వారికోసమై
ప్రతిసదనంబుకేగి తిరిపంబు గ్రహించెద చేయిసాచి - స
మ్మతిమది నాకు - దీనుల, నమాయకులన్ గనులెత్తి చూచు దు
ర్గతి భరియింపలే" నినిన గాలిబు నాత్మను సంస్మరించెదన్ ‖

ధృతి - శ్రీమంతులు పెక్కుమంది తమయాతిథ్యంబు నర్పింప - స్వా
గతపుష్పాంజలి పట్టుచున్ తిరిగి రాకాలాన గాలిబుకై;
అతడే జీవనసంధ్యవేళ తిన నాహారంబులేకుండ - శా
శ్వతమౌ నిద్దుర మేనువాల్చెనకటా! ప్రారబ్ధమూహింతుమే ‖

కఠిన హృదయాలు సైతము కరగికరగి
కాల్వలై జాలువారెడి కవితలల్లి
అధివసించెను సత్యసింహాసనమును
గాలిబుకవీంద్రు డత్యంత గౌరవమున!

గాలిబుగజళ్ళు విశ్వవిఖ్యాతిజెంది
నేటికిని చెక్కుచెదరక నిలిచిపోయె;
భౌతికంబుగ గాలిబు బ్రతికిలేడు -
కాని, కవనవీధుల యశఃకాయుడతడు ‖

# ఆవేదన

భరతమహోర్వియందు - భగవంతుని గొల్చెడి మందిరాలలో
పరమకిరాతకంబగు తుపాకులు దాగిన రోజులివ్వి - కా
పురములు వేరుచేసెడి ప్రబుద్ధులు పన్నిన వ్యూహమందు - సో
దరులయయో ! స్వతంత్రభరతక్షితి జీల్పగ నుద్యమించిరే !

పరుల హయాములో ప్రజలు బానిసలై - పడరాని పాట్లకుం
గురియగుచున్న వేళ - నొనగూడె స్వరాజ్యఫలంబు పోరుబం
దరు మహనీయు బుణ్యమున; దాని భుజించి సుఖింపుడయ్య ! బం
గరు భవితవ్యమెల్ల నరకమ్మొనరింప క్షమింపరెవ్వరున్ !

మతమౌఢ్యమ్ము శిరస్సుకెక్కినది ! "అమ్మా !"యంచు ద్రోహంబు సే
యు తలంపిప్పుడు నుద్భవించినది - ఏదో యెవ్వడో ఓర్వలే
క "తమాషా" తెరవెన్క సేయ - మన ఐక్యంబేడదాగెన్ ! ఇదే
శ్రుతిమించన్ వెలుగే హుళక్కి - బ్రతుకుల్ రోడ్లెక్కు నిర్వీర్యమై !

# ఆత్మీయము

ఒగరుచిగురుల తినుచు మహోన్నతముగ
పంచమమ్మున రాగసంపద వెలార్చి
రసజగానికి శ్రవణపర్వమునొసంగు
"కోకిలస్వామి" నాకు ప్రేమైక మూర్తి !

చీకటుల దేలియాడుచు జీవితమ్ము
గడపుచున్నను - వెలుగురేకలను జిమ్మి
ప్రకృతి యధరాన లేనవ్వువన్నె తొడిగి
అలరు "మిణుగురు" నాకు ప్రేమైకమూర్తి !

బురదలో పుట్టినను - ప్రభాకరుని వెలుగు
సోకినంతనె విప్పారి - సురభిళించి
ప్రభునిపాదాలు ముద్దిడి పరవశించు
"అబ్జసుందరి" నాకు ప్రేమైకమూర్తి !

ఆదరణలేని జీవితంబందు నిలిచి -
మథనమును జెంది - యోగసమాధి జొచ్చి
దివ్యమైనట్టి రూపుసాధించి - తేజ
మెసగు "గొంగళి" నాకు ప్రేమైకమూర్తి !

తనువు నిలువెల్ల కరగిపోయినను గాని
బాధనొందక మోదబాష్పములు రాల్చి
వెలుగునవ్వులపూలతో పలుకరించు
నట్టి "క్రొవ్వొత్తి" నాకు ప్రేమైకమూర్తి !

# స్వాగతగీతి

పెనుతుపానులు - వరదలు - తెనుగునేల
కెగ్గుసల్పగ - నేముఖమెత్తుకొనుచు
నడుగిడెదనంచు మోమోటపడకు తల్లి !
తనకు మాలిన ధర్మతత్పరుల మేము !

అనుదినం బొందుగాంచిన - హత్యలనుచు
మానభంగమ్ములనుచు - ప్రమాదవార్త
లరసి మడమద్రిప్పకు ! బసవన్న కొమ్ము
లెత్తగలడమ్మ ! నిన్నురక్షింప సతము !

తంబురా మీటి - హరికీర్తనంబు తోడ
వీధివీధిని ఆనందభిక్షగొనెడి
దాసరియ్యలు నీకు నూతనులు కారు
సిగ్గుపడకమ్మ ! ఇల్లిల్లు జేర్పగలరు !

పవలునేర్చిన మ్రుగ్గులపాఠములకు
రాత్రివేళ పరీక్షలు వ్రాసి వ్రాసి
బడలియుండిరి కన్నెలు - పరిశ్రమకు
తగిన మార్కులు వేసి ప్రోత్సాహమిమ్మ !

బావమరదళ్ళ నర్మగర్భ ప్రసంగ
హాస్యరసవాహినుల స్నానమాడినంత
మాయమైపోవు మార్గశ్రమమ్ము తల్లి !
స్వాగతంబిదె ! సంక్రాంతి పర్వలక్ష్మి !

# గోస్తనీ జలప్రళయం

ఏమమ్మా! తగదిట్టి దారుణము తల్లీ! పేర్మిమహారాశిపై
క్షేమంబొప్పగ జూచు నీకనుల నగ్నిజ్వాలలివ్వేమి? ఏ
బాముల్ జూడని దివ్యసీమ కభిశాపంబేమి? లేదెన్నడున్
నీ మాతృత్వమునందు మచ్చ; శుభవేణీ! శ్రీధునీ! గోస్తనీ!

పిల్లల్ దోషములంబొనర్చిరె! క్షమాభిక్షన్ ప్రసాదించు - నీ
యుల్లంబెక్కడ మూగవోయినది? అత్యుగ్రాకృతిన్‌లేచి - మా
పల్లెల్ పట్టణభూములందు, జలముల్ పారాడ సృష్టించితే
కల్లోలంబును; నీ చరిత్రమున మృగ్యంబిట్టి చైదంబులున్!

జలమార్గంబులు, కాలిబాటలొకటై సామ్యస్థితిన్‌దోచె - వి
హ్వల చిత్తంబుల మానవాళి తమకొంపల్ వీడుచున్ కాందిశీ
కులవోలెన్ గనిపింపసాగిరి - మహాఘోరంబు వీక్షింపగన్
హెలికాప్టర్లు వియత్తలాన చరియించెన్ - సృష్టి వక్రింపగన్!

మాకున్ నీకుగలట్టి బాంధవము సంభావింపుమోతల్లి! ము
క్కాకల్ దేరిన దేశభక్తులు, కళాకారుల్, మహాపండితుల్
రేకుల్ విప్పిరి నీకృపామృతము వర్షింపంగ నీ నేలపై;
ఆకీర్తిన్ నిలబెట్టుకొమ్మిక - అకృత్యంబేల గర్హింపగన్!

తెనుగున భారతాకృతినిదీర్చిన "నన్నయ"గారు - నీజలం
బునకు నమస్కరించి క్రతువుంబొనరించెను గాదె - తణుకు తూ
ర్పునగల జమ్మిచెట్టుకడ పూర్వము - జ్ఞప్తికిదెచ్చుకొమ్మ గో
స్తని! అటువంటి పావనయశస్వినికిం దగవీ యకార్యముల్!

గర్వపడెన్గదా ! మధురగాత్రి సమన్వితు "డాంధ్ర బాలగం
ధర్వుడు" "షణ్ముఖీ"బుధుడు నాటకరంగమునందు గీతికా
పర్వమొనర్పగా తెనుగుభారతి ! మాటలికేల ! ఆ యశో
ధూర్వహుండున్ త్వదంబుఘులతో వికసించుచునుండె గోస్తనీ !

తీయనికంఠమెత్తి గడితేరిన "గాయకరత్న"మై రస
స్థాయి వరించె - మున్ - హరికథాకళలో "ముసునూరి" సూర్యనా
రాయణ నామభాగవతు - డాతడు నైతము సేవతీరగా
నీ యమృతాంబువుల్ కడుపునిండుగ త్రావినవాడె గోస్తనీ !

నవకవితావిధుండయి - మనంబులనిల్చి - తెలుంగుసాహితీ
భువనము మెచ్చగా నమృతముంగురిపించుచు - నంతలోనె క
న్గవలను మూసికొన్న ఒక కావ్యతపస్వి "తిలక్"- రసజ్ఞ బం
ధువు - భవదీయమౌ మధురతోయము లానినవాడె గోస్తనీ ;

బాపూవాక్కు - మహాప్రసాదమను విశ్వాసంబుతో - జాతిసం
తాపంబార్పగ - రాజకీయమున నిందావాక్యమేలేక - తా
నా పత్తుల్గనె "వెరకవాడ నరసింహంపంతు" - లాయోధుడున్
నీ పానీయము నందుకొన్న సుకృతుండేసుమ్మ శ్రీ గోస్తనీ !

మురిపంబార కళాప్రపూర్ణ బిరుదంబుల్ ముప్వురిచ్చోట గాం
చిరి - శ్రీవేదుల - కీర్తిశేషులగు పెన్మెత్సాఖ్యాడున్, తిమ్మరా
ఢ్యాదు - డాగాథలు విస్మరించితివె ! నీపాలే కదా వారు గ్రో
లిరి ! వీక్షింపుము వెన్కకున్ తిరిగి తల్లీ ! నాటిబంధుత్వముల్ !

కవివై గ్రంథములన్ రచించి - భరతక్ష్మాదేవతామూర్తి దా
స్య విముక్త్యాత్మక సంగరాన నొక స్వేచ్ఛాయోధుడై - దేశభ
క్తి వచించెన్ "ముదిగంటి" వంశమున గాంధీయౌచు "జగ్గన్న శా
స్త్రి" వరేణ్యుం - డతడున్ ప్రమోదమున తల్లీ! త్రావె నీ నీరముల్!

ప్రణుతింగాంచిన "ఘండికోట" కుల సుబ్రహ్మణ్యశాస్త్ర్యాభిధే
యుని నిప్పట్టున గుర్తు జేసెదను; ధర్మోత్తంసుడై, వారణా
శిని విద్వజ్జన సత్సభాంగణమునన్ శీర్షంబుపై కెత్తె! గో
స్తని! యా ధర్మవిదుండు నేటికిని సంధ్యల్ తీర్చు నీవాహినిన్!

ఎటులంబ్రోచితొ! నీ జలామృతముచే నీభూమి లక్ష్మీకటా
క్షాటమై పచ్చగనవ్వె నిందనుక - నీ కల్యాణకావ్యంబులో
పుట నొక్కొక్కటి ద్రిప్పుమమ్మ - తెలియున్ పూర్వానురాగంబు ప్రా
కటమౌయట్టి చరిత్రకిప్పుడు కళంకంబేల శ్రీ గోస్తనీ!

జలదిగ్బంధనముం బొనర్చితివి - రాష్ట్రాలెల్ల నీ కౌగిటన్
చలిలో మూలుగుచున్న విప్పుడు - సమస్యల్ లేని ఈనేలపై
కలతల్ సృష్టియొనర్చి నవ్వుకొను సంస్కారంబునీకేల? చే
తులు జోడించి నమస్కరించెదను! ఆర్తుల్ గాచి రక్షింపవే!

శాంతంబున్ వహియింపుమా! అభయహస్తంబెత్తి కల్లోలిత
స్వాంతన్ - తణుకుపురాంగనామణిని - విద్వద్మాన్యులై నట్టి ది
గ్దంతుల్ గాంచిన నేలతల్లివి - దయార్ద్రస్వాంతవై బ్రోచి - అ
త్యంతంబైన ప్రతిష్ఠ నిల్పుకొనుమమ్మా! గోస్తనీ! ప్రాంజలుల్!

[గోస్తనీ నదికి సంభవించిన వరదలలో తణుకు పట్టణం
చిక్కుకొన్నప్పుడు వ్రాసినది - 1983]

# దీప్తచైతన్యం

మును నరకాసురుండు చనిపోయినమాట నిజంబె - కాని - ఆ
తని కనుయాయులై నెగడు దైత్యులు కొందరు నేటికేని - భూ
మిని విడనాడలేదు - పొలిమేరలు దాటనులేదు - వాడు చ
ల్లిన విషబీజపుంజమె ధరిత్రిపయిన్ ననలెత్తె దుర్విధిన్ !

వెలుగును చూడలేని యభివృద్ధి నిరోధక రాక్షసాధముల్
బలిసిన నేలపై మరొక "భామ" జనించి - దురధ్వగాములన్
గెలిచి - నవోదయ ప్రబల కేతనమెత్తిననాడె - ధాత్రిపై
వెలయును పండు వెన్నెలలు - విచ్చును నూతన పారిజాతముల్ !

మనసున నావరించిన తమస్సును జీల్చి - విశుద్ధమైన కాం
తిని నెలకొల్పి - మానిసి, మనీషిగ రూపును దిద్దుకొన్న - ఆ
దినమె ధరిత్రికెల్లెడల "దివ్వెల పండుగ"- కానిచో నటుల్
మనుగడకెల్ల వేళల నమావసియే ! కనరావు వెన్నెలల్ !

గగనభాగాన కారుమబ్బుగములెన్ని
ఘీంకరింపగ - ఝంఝులు హుంకరింప -
హృదయ దీపమ్మునకు భయమేమిలేదు
దాని వెలిగించువాడె ప్రజ్ఞానఘనుడు !

స్థిరగతిం దెలియని "సిసింద్రీ" చరిత్ర
ప్రజలకెన్నడు నాదర్శ-పథము గాదు;
"దీప్తచైతన్యము"ను ఊర్ధ్వ దృష్టిగలుగు
"చిచ్చుబుడ్డి"యె మార్గదర్శిగ రహించు !

# వెలుగుపూలు

ముదురు చీకటి నిదురలో మునిగినావు ;
కనులు విప్పవు - కాంతికై కాంక్షలేదు ;
ఎంత దయనీయమైన ప్రవృత్తినీది ?
త్వరితగతి కాలచక్రమ్ము తిరుగుచుండె ;

ప్రొద్దుతిరుగుడు పూలవె ; నిద్దురనక
నర్ధరాత్రి గతించినదాది - వెలుగు
కొరకు తపనపడుచు - తూర్పుకొండవైపు
కన్నులను నిల్పియున్నవి - కాంచుమోయి ;

కొదమ చీకట్లలో నుండి గొంతునెత్తి
"కొక్కొరోకో" ; యటంచు వెల్గును దలంచి
స్వాగతము పల్కు కుక్కుటస్వామి నరసి
మనికి నికనైన సరిదిద్దుకొనుము ! లెమ్ము ;

సృష్టిలోని చరాచరజీవకోటి
నెల్ల శాసించు మనుజుడవీవు కాదె !
బుద్ధికలదు - విచక్షణాశుద్ధికలదు !
చీకటులజీల్చి రావేమి ? వేకువాయె !

"నిన్న" గడచెను - "నేడు"ను "నిన్నవోలె
గడచుచున్నది - "రేపు"ను గడచు నిటులె;
విలువగల కాలమాగదు - వెలుగుపూలు
ఏంపుకొనుమోయి నీసజ్జనిండ నేడె ;

# స్వ రా జ్యం

దొర తలకాయమీద నసిదూయగలే - దణుబాంబు వేయలే -
దురిమిన సింగమట్టుల మహోద్ధతి చూపగలేదు - కాని - చి
చ్చర పిడుగై - "యహింస" యను సాధనముంగొని దాస్యభారతేం
దిరను స్వరాజ్యపీఠమున నిల్పిన గాంధికివే నమస్కృతుల్ !

ఒక తమ్మంయు మతాలకత్తి కెరగా నుర్వీస్థలిన్ గుక్కచా
వుకు లోనై తపియించినట్టి చరితంబుల్ విన్నచో సిగ్గు చే
టు - కులాలున్, మతముల్, మనుష్యులను మట్టుంబెట్ట - నింకేడ జా
తికి స్వాతంత్ర్యము ?.... గర్హనీయమగుకాదే ఇట్టి దుష్కృత్యముల్ !

ధరవర లాకసమ్ముపయి తారలుగా కనిపించుచున్న ఈ
తరుణములో ప్రజావసర దైనికవస్తువులెల్ల దాచి - సో
దరులను హింసపెట్టగల దైత్యులు - నేటి స్వరాజ్య భారతో
ర్వరపయి చీడపుర్వులు ! స్వలాభపరుల్ ! నరరూపరాక్షసుల్ !

ధన మానమ్ములు దోచి - సంస్కృతిని విధ్వంసంబు గావించి - హె
చ్చిన స్వార్థమ్మున రాక్షసుల్ పగిది నుజ్జీవించు చోరుల్ - ధరి
త్రిని నల్మూలలనున్న దేశమభివృద్ధిన్ గాంచునే ! జాతికే
తన మారోగ్య సమీరముల్ గొనునె ! స్వాతంత్ర్యంబు దీపించునే !

మమత నశించి - ద్వేషము సమాజములో నెలకొన్నచో - భవి
ష్యము శిశిరమ్ము - లేదిక వసంతము - సర్వుల మొక్కలై "స్వరా
జ్యము" కయి సల్పినట్టి మనత్యాగము లొక్కపరిన్ దలంచి - దే
శమున పురోగమించుమిక - జవ్వారు శాంతికపోతమూర్తివై !

# భారతరత్నం

నీలిమొయిళ్ళు నింగిని ధ్వనించిన వేళల - తెల్లనౌ కపో
తాలకు క్రొత్తక్రొత్త జలతారుతురాయులు కట్టి - దేశదే
శాలు - భళీ! భళీ! యని ప్రశంసలు సేయగ - శాంతినేతవై
వేలుపుదెర్వుపై నెగురవేసితివయ్య! ప్రధాని నెహ్రూజీ!

గీతాచార్యుడు గాంధిదేవుడన - నా కృష్ణ ప్రబోధమ్ములన్,
చేతస్ఫూర్తిగ నిల్పుకొన్న విజయశ్రీనీవు - మీ మార్గముల్
మీ తేజంబులు, దాస్యభావమును గూల్చెన్ స్వేచ్ఛగల్పించి - కా
లాతీతంబగు మీ చరిత్రలకు సామ్యంబున్నె యోచించినన్!

ముసిముసి నవ్వులంగురియు ముద్దుగులాబి నెదన్ ధరించి - సం
తసమున జీవితమ్ము భరతక్షితి కంకితముంబొనర్చి - న
ల్దెస చిరకీర్తినింపి - ప్రణుతింగొనగా ధ్రువతారవౌచు - నా
కసమున నిల్చితే యుగయుగాలకు భారతజాతిరత్నమై!

సిరికిం బట్టయి, సర్వసౌఖ్యములకున్ జీవంబునీవై, వసుం
ధరనెల్లన్ వెలయిచ్చి కైకొనెడి యర్థస్ఫూర్తియుంగల్గి - భో
గరమన్ వీడినయట్టి బుద్ధుడవు - వక్కాణింపగానేల? జ
వ్హారు నామంబున రూపమెత్తితివి - ఆర్యావర్తమే శోభిలన్!

సారథివై - నుతింపగ - ప్రజారథమున్ నడిపించినాడవ
న్నా! రమణీయమౌ పథములం దపరంజి వెలుంగులీన; నీ
నేరుపు శ్లాఘనీయము - వినిర్మలకీర్తి గడించినాడ వో
"భారతరత్న"! అక్షరనివాళులు నీకివె! యంజలించెదన్!

# లాల్ బహదూర్

అరువదిరెండువత్సరము లర్పణజేసి - స్వదేశసేవలో
చెరుగనిముద్రవేసిన విజేతయతండు ! నిజంబె శాస్త్రిజీ
మరణము !... విశ్వసింప ననుమానము కల్గె !.... విచారమెట్టు లం
తరముల దాచుకొందు - మొక నాయకతార గతించి పోయెనే !

లేదు ప్రధానిశాస్త్రి - కనలేమిక భౌతికరూపమిప్పు - డే
నీడల నేదతీర పయనించెనొకాని - ప్రభాత వేళలో
వాడెను భారతీయ ప్రసవంబులు - నాడులు క్రుంగిపోవగా
పాడెను దేశదేశములు బాష్పకణమ్ములు రాల్చుగీతికల్ !

బ్రతికిన నాల్గునాళ్ళు ప్రతిభావిభవంబుగలట్టి దిట్టగా
బ్రతికిన ధన్యజీవి కనరాడిక - వీరపతాకమెత్తి - భా
రత హృదయాల దాగిన పరాక్రమలక్ష్మికి నాంపెపల్కె - ఆ
రతసము చిట్లిపోయినది - రాక్షసమృత్యుపదాల ఘట్టనన్ !

# నవవసంతం

ఎపుడు దీపించునో - ఈ పేద కనులలో
చిమ్మచీకటిబాపు చిన్నిదివ్వె !
ఎపుడు నిండారునో - ఈ పేదడొక్కలో
క్షుద్బాధ దీర్చేడి కూటి ముద్ద !
ఎపుడు కాపాడునో - ఈ పేద మేనిని
గాలి, దుమ్ముల నుండి నూలుపోగు !
ఎపుడు ప్రాప్తించునో - ఈ పేద తలదాచు
కొనునీడగా పూరిగుడిసె యొకటి !

అప్పుడే సభ్యజగతికి - అచ్చమైన
పచ్చని ఉగాది - ఒక మహాపర్వదినము !
అప్పుడే విశ్వనరుని గృహాంగణమున
నవవసంతము ! ఒక మహానంద హేల !

# చైత్ర కల్యాణం

సీతావివాహ మీక్షించుటే బ్రతుకంచు
చెలువమొప్ప నరటి చెట్లునిలిచె ।
అవనిజోద్వాహంబు నరయుటే శుభమంచు
ననురక్తి కొబ్బెరయాకులలరె ।
జానకీ పరిణయశ్రీని దర్శించుటే
ఘనమంచు పచ్చతోరణము లెసగె !
వైదేహి కల్యాణభాగ్యమ్ము గాంచుటే
వ్రతమంచు సుమలతల్ పరిఢవిల్లె ।

ఎన్ని వచ్చని మనసులో ఈవిధాన
పెళ్ళిపందిరిలోన కన్పింపదొడగె ।
మనుజునకె కాదు - ప్రతి జీవమునకు - " సీత
పెళ్ళి " విశ్వకల్యాణమై వేడ్కనింపె !

ఆ మహాకాయమాన మధ్యమున - వేద
శాస్త్ర సమ్మతమగుచు - విశాలమైన
రమ్యమగు వేదియొకటి నిర్మాణమయ్యె -
గంధపుష్పాక్షతల అలంకరణ లెసగ;

అదిగో ! సఖితోడ మెల్లగా నడుగులిడుచు
కదలుచున్నట్టి యొక దీపకళిక - సీత -
వచ్చిచేరెను వేదికాభ్యంతరమున;
క్రొత్తకోర్కెలు గుండెలో గుబులుకొనగ ।

"చుక్క"కు బుగ్గపై - చుక్క పెట్టినయట్టి
          చానలెంతటి నోము నలిపినారొ!
"కల్యాణి" మోముపై - కల్యాణరేఖ తీ
          ర్చిన ప్రౌఢ లేపూజ చేసినారొ!
"కలహంసి" మృదుపాదములకు బారాణి పూ
          సిన సతీమణులెంత ఘనతగనిరొ!
"పూబోడి" సిగలోన - పూలను తురిమిన
          చెలులెంత పున్నెంబు నిలుపుకొనిరొ!

ఎప్పు డేయదృష్ట మెవరికి కల్గునో
ఎవరు చెప్పగలరు? ఎవరికెరుక! ...
పలిపినట్టి పుణ్య పంచయమెపుడొ - యా
కృతి వహించు - నది య నృతముకాదు!

అరుసంబొప్పగ మిథిలా
పురాధిపతి జనకుడంత - భూసుత - సర్వా
భరణాలంకృత - నా రఘు
వరునకు నర్పించువేళ ప్రవచించె నిటుల్....

"మా యమ్మాయిని స్వీకరింపుమిదె రామా! సీత యెల్లప్పుడున్
ఛాయంబోలె చరించుచుండును - మహాసాధ్వీమణిన్ గన్న - నా
ధ్యేయంబున్ నెరవేరి - నీ కరములందీనాడు నేనుంచితిన్;
శ్రేయంబందగ నేలుకొమ్మిక యశశ్శ్రీలెల్ల సిద్ధింపగన్!"

కాలమొకింతసేపు తమకమ్మున నాగినదాయటన్న భా
వాలతు - ప్రేక్షకాళి కనుపాపలె సాక్ష్యలు - కంటిరెప్పలే
వాలక నిల్చియుండె - తలబ్రాలుగ - వైభవమీన - మంచిము
త్యా లటుపోసికొన్న నవదంపతులందురె ముజ్జగాలలో !

అనురాగమ్మును, సిగ్గు, జోడుపడగా - నా సీత - రామయ్య మో
మును వీక్షింపగలేక - నాధుచరణమ్ముల్ గాంచగానే - నఖ
మ్మున నామోమె స్ఫురించె - రాఘవుని చూపుల్ మాత్రి మాసీత కం
ఠ్ఠను లగ్నంబయె - నెంతయున్ మగమహారాజుల్ యధేచ్ఛారతుల్ !

ఇనబింబమ్మున శుద్ధియై నెగడు - ఆ యిక్ష్వాకురాజన్య మూ
ర్తిని - చంద్రాస్య మహీజ - ఫాలమున కీర్తిశ్రీ విరాజిల్ల - ని
ల్పెను గాదే తిలకమ్ముగా - ఎవరికా విశ్వంభరాదీప్తి య
బ్బును ? సీతమ్మకు దక్క..... ఆమె చరితంబుల్ లోకకల్యాణముల్ !

దేవదుందుభులెల్ల - దిక్కులు హర్షింప
జయజయధ్వానాలు సలిపెనపుడు !
పుష్పసంతాన మామోదమ్ము జిందుచు
పరిమళమ్ములవాన కురిసెనపుడు !
గంధర్వులంతట - గళములు సవరించి
వరరాగమాలికల్ పాడిరపుడు !
అప్సరోభామ - వొయ్యారాల పోత్రిపులై
అభినయశ్రీలతో నాడిరపుడు !

సంయమీంద్రులు - సుకవీంద్రచయము - హితులు
నవ్య యానందమును బొంది - అక్షరాక్ష
తలను గై సేసిరా నవదంపతులకు -
భావియుగముల్ హారతుల్ పట్టునటుల ..

జానకీరామ పరిణయ సన్మహంబు
ప్రకృతి పురుషుల కలయిక పగిది తోచె :
విశ్వకల్యాణ వేదిపై విమలమైన
సత్యధర్మమ్ములకు నాడు జంట కుదిరె :

ఒక వసంతమ్మె కాదు - నవోదయంబు
జెంది " కుహూ కుహూ "…. యంచు కూసినది నాడు :
సృష్టిలో గల్గు ప్రతి రమ్యచిత్రమపుడు
ఆలపించెను చైత్ర కల్యాణగీతి :

# నేటి దీపావళి

నేటి "తారాజువ్వ" - నింగి కెగసినట్టి
        ధరలకు నూతనార్థముగ తోచె !
నేటి "టపాకాయ" - కాటకమ్మున ప్రేలు
        బడుగుగుండెకు ప్రతిధ్వనిగ తోచె !
నేటి "భూచక్రమ్ము" - నెత్తి చుట్టు తిరుగు
        పలుసమస్యలకు వ్యాఖ్యలుగతోచె !
నేటి "సిసింద్రీ" - అనేక వక్రిములున్న
        బ్రతుకు బాటకు నుదాహృతిగ తోచె !

పర్వదినమన్న మోద మెవ్వానిలోన
నేడు కనిపించకున్నది - కూడు, నీరు
దొరకినన్ జాలు కొండంత సిరియటన్న
తృప్తితోనుండె నేటి సంతప్తనరుడు !

# గ్రీష్మపతి

చలికిన్ వానకు బాధలంబడుచు - రాస్తాప్రక్కలన్ - లేక - చె
ట్టుల క్రిందంబడి కున్కు తీయని నికృష్టుల్ నీ ప్రభుత్వంబులో
కలతల్లేని సుషుప్తిగాంచెదరు - ఉగ్రంబైన నీ చూపులో
పల నీదీన శరణ్యతత్త్వమును సంభావింతు గ్రీష్మప్రభూ !

అపుడే నూతనజీవగానమున - భార్యాభర్తలై - ప్రేమ మం
టపముంజేరిన క్రొత్తజంట నిను దిట్టంజూతు; రాలింపక
య్యా ! పరాకున్ వహియించి వారికిడుమయ్యా - బుల్లిబుజ్జాయి - స
త్కృప వర్షింపగ; నీ కతంబున కదా కేదారముల్ పండెడిన్ !

కోకిలస్వామిని కుహూకుహూ గొంతెత్తి
వీనులవిందు గల్పించు నీకు !
దొరసానిమల్లిక సురభిళమ్ము వెలార్చి
నాసికాశుద్ధి నొనర్చు నీకు !
ఆమ్రఫలేందిర అమృతమ్ము నందించి
రసనాంచలస్ఫూర్తి నొసగునీకు !
పుచ్చకాయసకియ విచ్చిన మనసిచ్చి
అనురాగమున దాహమడచు నీకు !

ఈ యదృష్టమ్ము ఋతుమూర్తి కెవనికేని
వసుధపై కల్గెనే ! గ్రీష్మపతి ! వచింపు;
మెవ్వని యదృష్ట మెవ్వనికెట్లు కలుగు
వన్న సూక్తిలో నిజము నీయందు తోచె !

# నవభారతం

మమతకు, ధర్మవర్తనకు, మందిరముల్ నెలకొన్న శాంతి దే
శమున నివేమి చైదములు? జాల్మలనేతలు రెచ్చిపోయి - ర
క్తము ప్రవహింపగా విలయతాండవ నృత్యము జేయుచో - స్వరా
జ్యము తుద కల్లిబిల్లి కథయై పడిపోవును పేకమేడగా ।

సోమరిపోతులై - పనికి చుక్కెదురై - ప్రతిగుమ్మమందు బా
ధామయ జీవితాలకు సుదాహృతిగా నటియించు యాచక
స్వాము లనేకులుండిరి - అశక్తులు కొందరు - వారి దీర్చి, సం
క్షేమము గూర్చునాడె వికసించు స్వరాజ్యనవప్రసూనముల్ !

అంతర్యుద్ధము, లాగడంబు, లనునిత్యం బెక్కడోచోట - పె
న్వంతల్ రేపుచునుండె - నిట్టివి సహింపన్ రాని దుష్కృత్యముల్:
ప్రాంతీయత్వము, వర్ణభేదములు, నాల్కల్ సాచినన్ - లేదు - భా
స్వంతంబైన స్వతంత్ర జీవితము దేశంబందు నెవ్వానికిన్ ।

పదవులవేటలోన నయవంచకులై తిరుగాడినన్ - మరే
ఉదయము లేదు - సంజదెసకూగుటతప్పదు - దేశభక్తులై
హృదయము లంకితంబిడి, యహీనయశస్సును నిల్పుకొన్న, అ
భ్యుదయచరిత్రకారకుల నొక్కపరిన్ స్మరియింపు మిత్తరిన్ ।

బానిసగా ననేకమగు వత్సరముల్ నరకాన మగ్గి - ని
ద్రాణతనున్న జాతిని, కలల్ ఫలియింపగ మేలుకొల్పి - స్వే
చ్ఛాన వకేతనంబిడిన జాతిపితన్ స్మరియించుకొంచు - గాం
ధీ నవభారతానికొక దీప్తినొసంగుము భారతాత్మజా ।

# ఇందిరా నిర్యాణం

ఒక మనోహర దివ్యమహోదయాని
కడ్డు నిలిచినదెవ్వరీ గడ్డమీద ? ....
ముదురుచీకటి నిలువెల్ల పులుముకొన్న
ఆ తిరోగాములెవ్వరమ్మా ? హిమాద్రి !

ఎవ్వరా తంబురాతీపె నిటుల తెగ్గించి
భావిరాగోదయశ్రీనివాసమందు
నీలినీడలు పరచిరి? ....కాలకూట
విషము చల్లిరి? . నిప్పులే విసిరినారు !

ఆ మరతుపాకులగొని - రాయంచకెవరు
సంజరంగు పులిమిరి నిషాదవృత్తి ?
ఎంత దురదృష్టకరము ! భరింపలేదు
భారతీయ మానస సరోవరము నేడు !

ఆ కరాంగుళులెవరివి ? ఆ కఠోర
కాలరాక్షసులెవ్వరు ? కంటిపాప
చిదిమి జగమెల్ల చీకటి చేసినారు -
మాతృ హంతలా ! వాస్తవమా ! ధరిత్రి

ఆ మతోన్మాద తీవ్ర దురాత్ములెవరు ?
చెరిపివేసిరి భారతేందిరముఖాన
శ్రీ రహించెడి నొకగర్వరేఖ నిపుడు -
అంగరక్షకులా ! నిజమా ! త్రివేణి !

ఒక సుగంధ సమన్విత - మొక పరిశాంత
భరితమగు గులాబీతల్లి ప్రక్క నిలిచి
రక్షణము సల్పు కంటకవ్రాతమకట !
కాటు వేసెనె ! ఎంతటి ఘాతుకమ్మొ !

కంచెయే చేనుమేసిన కథలు వినని
జాతి కిదియేమి దౌర్భాగ్యచరితమబ్బె !
పెంచుకొన్న ప్రజాస్వామ్య వృక్షమునకు
పురువులయి తల్లివేరునే కొరికి రయయొ !

# ప్రతీక్షణం

రమ్మి సకియ! నీ యందెల రవళిలోన
కలిసిపోయెద రసికలోకాల నరసి;
చిమ్మచీకట్లు నీళ్ళాడు క్షితికి నీవు
ఒకనిమేషము రమ్మి విద్యుల్లతాంగి!

ఎన్ని యుగములు గడచిపోయినవొ - నేటి
కెన్ని మన్వంతరాలు జీర్ణించెనో స
ఖీ!.... చివికిపోయిన గుడారమియ్యదే వ
చించు - నాదు ప్రేమకు వయసెంతగలదొ!

ద్వాః కవాటము కదలిన తరుణమందు
చెలియ! వచ్చితివని యాసజెందినాడ -
అలరు నెత్తావులను దాల్చి, తలుపుతట్టి
నట్టి తెమ్మెరలన నెంతొ వ్యధనుబడితి!

వ్యోమపథమున వెన్నెలపులుగుపిండు
విధుడు ప్రసరించు సుధలు సంప్రీతి ద్రావి
మేను మరచిన వేళ - నాలోని యెడద
నెన్ని రంగుల తలపులు తన్నుకొనెనొ!

పవలు రాతిరి ఎవరినో పలుకరించు
బుడుతసెలయేళ్ళ నుడి నాకు బోధపడక
పాదపద్మాలు తడుపుచు వచ్చితివని
సకియ! మోసపోతిని - ప్రతీక్షణము మిగిలె!

# మద్యంలో మానవుడు

మతములు గొంతుచించుకొని "మద్యము త్రావుటకంటె వేరు దు
ష్కృతము జగాన లేదని వచించుచున్నను - లెక్కలేక - దు
ర్మతులయి - మానవత్వమును మాపుచు - హీనచరిత్ర మూల్గుచున్
బ్రతికెడువారిలోని తిమిరంబును బాపవె భారతాంబికా !

త్రాగినమత్తులో తెలియరాని యకృత్యములంబొనర్చి - కా
రాగృహవాసదుర్గతిని గ్రమ్మగుచు - కాలము వెళ్ళబుచ్చు దు
ర్యోగము జాతిజీవితములో తలయెత్తగరాదు - గాంధిజీ
రాగములో నపత్రుతులు వ్రాకిన దేశచరిత్రి లేదికన్ !

ఆలుంబిడ్డల గాలికిన్ వదలి - మద్యస్వాంతుడై - పిచ్చిగా
ధూళిందొర్లుచు - వెర్రిమొఱ్ఱి పలుకుల్ దుష్టంబుగా నాడుచున్
కాలంబున్ దొరలించు మానిసికి - ఫక్కా వైద్యముంజేసి - గాం
ధీలక్ష్యంబును నిల్పుకోవలె సవిత్రీ ! భారతోర్వీసతీ !

దినమెల్లన్ శ్రమియించి - చెమ్మటలలో దేహంబునీరార్చి - చి
క్కిన పైకమ్మును పానశాలకిడి - రంకెల్ వెట్టుచున్ గూటికిం
జను దౌర్భాగ్యుల గోడు జూచినపుడున్ " జాతీయతా వేదనా
గ్ని " ని నాగుండెల దాచుకొందును - మనఃక్లేశంబు వెంటాడగన్ !

సరదాగా ఒక " పెగ్గు " పుచ్చుకొని - సీసా లాపయింద్రావి - సం
సరణంబున్ నడివీధి బెట్టుచు - ప్రతిష్ఠన్ గంగలో కల్పుచున్ -
తిరిపంబెత్తుటకైన సిగ్గిలని బ్రాందీ బాబులంజూచి - ఏ
సరణిన్ గర్వము సందగగ్లెదవు స్వేచ్ఛాభారతోర్వీమణీ !

ర స రా జు

అతినీచంబగు మద్యమునంగొనుచు దుర్వ్యాపారపారీణతన్ -
క్షతమొందెన్ ముని కృష్ణునంతటి విభుంగన్నట్టి వంశంబు - అ
శతలంద్రోసి యథేచ్ఛ వర్తిలెడి మూర్ఖస్వాంతలోకాని కీ
క్షితిపై లేదిక సుప్రభాతము - తమస్సే జీవితాధ్వంబగున్ !

మద్యపానంబులోగల్గు మత్తు దవిలి
బ్రతికి బట్టకట్టిన ప్రభుత్వములు లేవు -
రాణకెక్కిన "రోమను" రాజ్యమెల్ల
నందుకొనె నేమికీర్తి? మద్యమునువలచి !

ఊపిరితిత్తులంగొరికి యుక్కడగించెడు మద్యపానమే
శాపముకాగ - వృద్ధిగనజాలినయట్టి మనీషు లెందరో
పూపవయస్సునందె తనువుంబలిజేసిన దాఖలా, లవె
న్నో పరికింపవచ్చును - కనుల్ తడియారని దీనగాథలై !

సురసేవించుటయే ఘనంబనెడు మోజుంబడ్డదీనాటి నా
గరకమ్మన్య సమాజ - మీవ్యసనరోగం బిట్లె జీర్ణించి వా
నర చిహ్నంబులతో తిరోగమన దైన్యంబందు వర్తించినన్
చరఖాసమ్మని కాత్మశాంతికలదే - స్వాతంత్ర్య దేశంబునన్ !

# నరుడు - నరకుడు

కనుల ముంగిట కటికి చీకటి వసింప
నొక్క నిమిషమ్మ భరియింప నోపలేక
దివ్వె వెల్గించు నరుడు గుర్తింపదేమి ?
గుప్తతిమిరమ్మ పుట్టిన లిప్తనుండి !

ఎన్ని కాకరపూవత్తు - లెన్ని చిచ్చు
బుడ్డు - లెన్ని జువ్వలు - మతాబులు మరెన్ని
వెలుగులందించినను - కనువిందుకాదు !
గుండెదివ్వియ నవ్వినన్ పండువగును !

మరతుపాకులు - బాంబులు - మనిషిలోని
రక్తమును పుక్కిలించిన రాదు కాంతి !
విశ్వమానవ కల్యాణవేదిపైన
ప్రేమవీణ మ్రోగినచో - లభించుశాంతి !

ఎట్టి మొనగాడు కూడ మహీతలాన
కాంతి కవరోధమిడి బట్టకట్టలేదు -
నరకుడేమయ్యెను? చరిత్ర మరచువాడు
నరుడు కాలేడు - తొంటివానరుడు కాని;

పూలబాటలలో పాడుముళ్ళు పరచి
నవ్వుకొనువాడు నరకుడు - నరుడుకాడు ;
అడుగుజాడల నాదర్శమవఘళింప
కాంతిపథమును నిర్మించు ఘనుడె నరుడు !

# నీరాజనం

ఓ మహాపర్వరాజ్ఞి ! శుభోదయంబు !
రమ్యసంక్రాంతిలక్ష్మి ! నీరాజనంబు !
తెలుగువీధు లభ్యుదయదీప్తిని వహింప
రంగవల్లుల రథమెక్కి రమ్ముతల్లి !

బాధలేయుండవచ్చును - బరువు బాధ్య
తలకు తలబొప్పికట్టి వ్యాకులత జెంద
వచ్చు - కాని - అతిథిపూజ పట్లమాకు
వాడిపోలేదు భక్తిభావంబులెపుడు !

తెలుగుబిడ్డలమేము ! ఆతిథ్యమనిన
పొంగిపోవుట మాకున్న మొదటిగుణము !
నీకు తెలియును "డొక్కలు" నింపినట్టి
అమ్మ "సీతమ్మ" మా యింటి ఆడపడుచు !

కొన్ని మండలాలు తుపాను కోరలందు -
కొన్నిజిల్లా లనావృష్టి కుహరమందు -
చిక్కుకొని బయల్వడ్డవి; చిత్రహింస
లనుభవించిన యవి - నీకు నవగతమ్మె !

అభయహస్తంబు జూపించి - ఆర్తిగొన్న
బడుగుగుండెల కూరటబల్కు - క్రొత్త
కాంతినింపుము చీకటుల్ కరిగిపోవ;
రమ్మ ! విచ్చేయుమమ్మ ! సంక్రాంతిలక్ష్మి !

# విద్యుత్ జ్యోతి

ప్రకృతిని లీనమై తరతరాలు నిరర్థక మొందియుంటి - వే
సుకృతమొ పండి - నిన్ను పరిశోధనజేసి - "కరెంటు" పేర మా
సకల జనాళికిచ్చె "ఎడిసన్" సుముహూర్తమెరింగి - లేనిచో
ఒక క్షణమేని నన్ విడిచియుండగ కష్ట - మదేమిబంధమో !

ఆలోకించిన - సర్వభూములకు నీయాశీస్సులే వేదమం
త్రాలై యభ్యుదయంబు గూర్చెకద విజ్ఞానంబు దీపింపగా !
నీలోశక్తి స్మరింపతగ్గది - ప్రిజల్ నీ సన్నిధానంబులో
కాలంబున్ నడిపించుచుందురు - నమస్కారంబు నీ జ్యోతికిన్ !

నిను జాగ్రత్తగ చూచుకోవలెను, కానీ లిఫ్టులో ప్రాణముల్
గొనగా సందియమందబో వదియు నీకున్ శాపమేనాటిదో
వెనువెంటన్ దిరుగాడుచున్నయది - దీప్తింజెందు నిన్జూడ - నా
మనమం దొక్కొకవేళ కల్గు వ్యథ - నీమచ్చున్ విలోకించినన్ !

# భారతీయుడు

కత్తిదూయలేదు - కదనంబు జరిగెను;
మాయలేదు - ఎదిరి మదమడ్రిచెప్పె;
హింస నెరుగలేని ఈజాతి చరితలో
ఇన్ని రుధిరముద్ర లిప్పుడేల !

జాతిలేదు-మతము - జాబితాలోలేదు;
బాసలేదు - వేరు ఊసులేదు;
ఒక్కబాట నడచి - ఒక్కగొంతుకవిప్పి
స్వేచ్ఛకొరకు ప్రజ తపించె నాడు !

బోసినవ్వు విసిరి బోనులో చిక్కిన
దేశమాత వెలికిదీసెనొకడు ;
మతము తలకునెక్క మాతృదేవినిగాల్చి
తీవ్రవాది బయలుదేరె నేడు ;

ఎన్ని కేతనంబు లేమతంబులవైన
నెగురవచ్చు - దోషమేమిలేదు !
సమత మమత మరచి జాతికేతనమునే
గాయపరచినపుడు కలుగుబాధ ;

చెరలలోన క్రుంగి - ఉరికంబములకెక్కి
చివరికెటులో జాతి స్వేచ్ఛపొందె !
దాని నిలుపుకొనని దౌర్భాగ్యదశలోన
భారతీయుడెపుడు బ్రతుకరాదు !

# జిల్లేడు పువ్వు

" ఎన్ని దినంబులీ భువి గతించినవోకద ! లెక్క పెట్టినన్
కన్నుల కాంతినింపిన క్షణమ్మొకటైనను లేదు - జీవితం
బన్నది మోదఖేదములు కాలయముందురు - కాని - ఖేదమే
యున్నది - లేదు మోదమని యూహనొనర్చితి నింతకాలమున్ !

నను పుట్టించిన కారణంబెదియొ యేనాడైన సింహావలో
కనముంజేసెనొ - లేదొ - యామహితరక్షాదక్షు; డాయయ్య చూ
డ్కున సర్వంబొకటై రహించునను పల్కుల్ కాలదోషంబు ప
ట్టిన వింకన్ - సమతావిభుం డిల కలండేయంచు దూషించితిన్ !

ధూళిని గప్పుకొంచు - నొకదోషిగ ప్రక్కలనిల్చి - దీన గా
ధాలయ కావ్యవస్తు పరమాశ్రియనై పడియున్నదాన; ని
దాఘశుపునై ప్రగాఢతిమిరంబున కంకితమైనదాన; నీ
వేళ నుషోదయ ప్రథితవీధుల నిల్చితి - నే యదృష్టమో !

ననుగని ఆదరించగల నాధుడె లేడనుకొంటి - కాలవా
హినికి శిరస్సువంచి తపియించుటె పుట్టిననాటినుండి నే
ర్చిన తొలిపాఠ - మెన్నడు హసించినజాడలె లేవు - జీవితం
బున వికసించె నేటికొక పున్నమివెన్నెల - పూర్వ పుణ్యమై !

ఆవల పూలతోట కల - దచ్చట - మల్లె, గులాబి, జాజులె
న్నో వికసించి పుట్టువుల కున్నతిగూర్చు ప్రయత్నమందు నె
త్తావుల జిమ్ముచుండ - పరితప్తమనస్వినినౌచు నేనిటన్
బావురుమంచు నొంటిగ ప్రవాసముజేసితి నింతదన్కయున్ !

ఒక చేమంతి యధఃకరించె - మరి విద్యోతించి వేరొక్క చం
పక మౌద్ధత్యము చూపె - నింక నటుపై మందారమెగ్గించె - మ
ల్లిక యాపైన పరాఙ్ముఖత్వమును దాల్చెన్ నన్నువీక్షించి - నే
టికి నాదైన్యము రూపరెన్ - తలుపుతట్టెన్ పుణ్యవాతౌఘముల్ ।

దేవుని శీర్షమందో - సుదతీమణి క్రొమ్ముడియందో నిల్చి - ఆ
పూవులు సార్థకత్వమును పొందుచునున్నవి - నా చరిత్రికే
సేవయులేదు - నన్నని స్పృశించు మహాత్ముడు లేకపోయె - బా
ధా విలపౌ ప్రపంచమున దైన్యతనందితి నేటిదన్కయున్ ।

పూవుగపుట్టి - కాయనయి - పొట్ట పెరిల్లన - పింజపింజగా
దేవునికోసమై సకలదిక్కులకున్ పరుగెత్తుచున్న నా
జీవనయాత్రిగాంచి - అరచేతుల కన్నులగప్పుకొన్నవా
రే - విరచింతురింక రహియించిన ఈపరిణామగాథలన్ ।

శివునిశిరాన నన్ను నభిషేకమొనర్పగ వచ్చినావె - క్రొం
బువులను త్రోసి; యెంతటి యపూర్వచరిత్రము !... దీనగాథలో
చివికినయట్టి నన్ను - నొక "జిల్లెడుపువ్వు" ను స్వీకరించు నీ
పవిమల చిత్తవృత్తికి నలామొనరించెద నర్చకప్రభూ ।

ఇది శివరాత్రి - జన్మకిదియే శివరాత్రి - విషమ్ముమ్రింగి సం
పదలిడు దొడ్డవేలుపు నుమాపతి శీర్షమలంకరించు న
భ్యుదయము జీవితంబునకహో ! నను వేగ గ్రహింపు" మంచు స
మ్ముదమున వంగె నర్చకుని ముంగిట "జిల్లెడుపువ్వు" తృప్తిమై ।

# అభయాశీర్వాదం

రోజుల్ రోజులు గుండియల్ చెదర - కర్ఫ్యూనీడలో దాగి - ద
ర్వాజాసందులలో కనుల్ నిలిపి - ఘోరంబౌస్థితిన్ గ్రుగ్గి - ని
స్తేజంబౌ బ్రతుకీడ్చువారి కభయాశీర్వాద మందించి - ఉ
త్తేజంబైన ప్రభుత్వమీయవె ; ఉగాదీ ! స్వాగతాభ్యర్చనల్ ;

వరకట్నంబను కాలరాక్షసుడు శాపంబీయగా - ఆడుకూ
తురు లేనాడురితాళ్ళ మధ్యమున గొంతుల్నిల్పి - దీనంబుగా
తరుణ ప్రాయమునందె కన్మొగుచు సందర్భాలు కోకొల్ల - లా
చరితంబుల్ సరిజేయుమింక ! నవవర్ష స్వామినీ ; హారతుల్ ;

ధరవరలాకసమ్ముపయి తారకలైనవి - కూలిడబ్బు తో
గిరమునకైన చాలని నికృష్ట పరిస్థితులావహించె - ఏ
సరణిని జీవితమ్ములను సాకెదవోగద - ఏ విధాన నూ
పిరులను నిల్పి - అభ్యుదయ వేదిక గూర్తువొ !.... స్వాగతాంజలుల్ ;

ధనమోహమ్మున సాటివ్యక్తులకు వంతల్గూర్చుచున్ - రమ్య జీ
వన మార్గమ్ముల కంటకమ్ము లిడుచున్ - వస్త్రాదులొచున్ - చలా
మణియౌచున్న కసాయివాండ్రు కలరమ్మా నేడు మా భూమిపై ;
మునుముందా కుటిలప్రవృత్తులకు కొమ్ముల్దుల్చి చెండాడుమా !

ఉగ్రవాదంబులీనాడు హుంకరించి
రక్తమును దాగ్రవుచున్నవి - రాక్షసముగ
వేడికన్నీరు తుడిచి దీవింపవమ్మ ;
స్వాగతాంజలి ; అక్షయవత్సరాది ;

# వర్ణచిత్రాలు

ఊడిగము చేసి తనతల్లి ఉస్సురనుచు
గుడిసెలోపడి నిద్రింప - గూటిలోని
పైసలెల్ల నపహరించి - పానశాల
నోలలాడగ పరువెత్తె యువకుడొకడు !

చావు బ్రతుకుల మధ్యలో చరమగీతి
నాలపించెడి తనతండ్రి కౌషధమిడ
నొక్కపైసయు దొరుకక యువకుడొకడు
" ఈశ్వరా ! కావు" మని తపియింపసాగె !

కూడునీళ్ళను కడుపార గోలకెపుడు
వర్తకమునందు ప్రతిపైస భద్రపరచి
ఉత్సుకతజెందు వణిజుడౌ యువకుడొకడు
వగచె నవ్వేళ పైసలాభమ్ము లేక !

# ప్రళయ చిత్రం

పాలచుక్కలు లేక పాపాయి - చుట్ట
ముక్కలేలేక ముక్కాలి ముసలితాత -
ఎంత గిలగిలలాడిరో యెవరికెరుక ?
వలదు పగవానికైనను వరదబాధ !

ఇంటికప్పులపై కుక్కలెక్కియేడ్చె -
చెట్లకొమ్మల బాములు శిరములెత్తె -
ప్రకృతి రచియించు ప్రళయచిత్రంబులోన
ఎన్నిరంగులు కలవో ! ఊహించలేము !

పడగవిప్పిన వరదకు - ప్రాణభీతి
జెట్టుకొకరు పుట్టకొకరు చెవరిపోవ -
దొంగతనములు, దోపిడీల్ పొంగిపొరలె !
" గోరుచుట్టు - రోకటిపోటు " గుర్తువచ్చె

పచ్చగా నవ్వులీనెడి పంటచేలు
తలలు వంచినవయ్యయో ! కలతమునిగి;
అన్నమిడు " అన్నపూర్ణ " దుఃఖార్ణవమున
చేతులెత్తినదా ! ఎంతచేటుపుట్టె !

ఈ భయానకముద్ర వహించి - మృత్యు
దంష్ట్రలెత్తిన వరదలో - ధైర్యమూని
కట్టెలార్జించు మొనగాండ్రు కలరు ! భళిరె !
వలపులిట్టివా రేపటిబ్రతుకుపైన !

# ఓ ప్రభూ!

ఒక దివ్వె వెలిగింపుమో ప్రభూ! మాలోన
కాంతియేలేదు - చీకటులు తప్ప;
ఒక రాగమును పాడుమో ప్రభూ! మాలోన
అనురక్తిలేదు - ద్వేషాగ్ని తప్ప;
ఒక పారిజాతమిమ్మో ప్రభూ! మాలోన
తావిలేదొక - గబ్బుతనముతప్ప;
ఒక స్వాదుఫలమీయుమో ప్రభూ! మాలోన
మాధుర్యమేలేదు - చేదు తప్ప;

ఇన్ని వికృతగుణాలతో నేలుచుండె
నరకదైత్యాధముడు మామనంబులెల్ల;
ఎపుడు తెరవేసెదో దుష్ప్రవృత్తికీవు!
ఓ ప్రభూ! నాడె కాంతిమహోత్సవంబు!

# సమతాగవాక్షం

మతము జబ్బుచరచి మారణహోమంబు
సలుపునాడు - జాతిచరిత సున్న !
మమత పరచి - మతము - సమతాగవాక్షమ్ము
తెరచునాడు - జాతిచరిత మిన్న !

రక్తధారలందు రాముఁడా ? మహ్మదా !
తృప్తిపొందగలుగు దేవుడెవరు ?...
గుండె గుండె కలిపి - క్రొత్తమార్గమ్ములో
నరుడు నడచినపుడు నాకమగును !

సహనముద్ర చెరపి - స్వార్థదృష్టి నిలిపి -
మానవత్వమునకు మసినిపూసి -
నరుని కాటువేసి - నరకమ్ము సృష్టించు
మతములేల ? వేయి మాటలేల ?

ఎన్నినదులు పుట్టి ఎటులేగినను గాని
కడకు కడలిచేరు; గమ్యమొకడె !
వేయిమతములున్న ధ్యేయమ్మదొక్కటే -
" ప్రేమలతను నరుడు విరియవలయు! "

ఆయుధమ్ము విసరి హతమార్చుటా గొప్ప ?
పూలుజల్లి ప్రేమపొందవలయు !
మత్తులోనదింపి - మంటలు రేపుచో
మతము మతముకాదు ! మర్కటమ్ము !

# ఆహ్వానం

మూతి ముడుచుకొన్న ముద్దబంతికి ప్రస
న్నతగూర్ప రమ్మ ! స్వాగతము తల్లి !
'వెన్ను' విరిగిన రైతన్నకూరట బల్కి
ధృతిగూర్ప రమ్మ ! స్వాగతము తల్లి !
తంబురా జారిన దాసరయ్యకు శుభ
శ్రుతి గూర్ప రమ్మ ! స్వాగతము తల్లి !
కళలేని బసవన్నకనులకు చేతనా
ద్యుతి గూర్పరమ్మ ! స్వాగతము తల్లి !

ఒక అనావృష్టి - ఒక తుపాను - కనులెఱ్ఱ
జేసి విలయతాండవమొనర్చినవి తల్లి !
తెలుగు సీమకు వెతబాపి - దీప్తి నిడగ
అడుగు లిడవమ్మ ! సంక్రాంతి ! స్వాగతమ్మ !

# గాంధీభారతం

ఒకడు తుపాకిగుండు కెదనొడ్డి - మఱొక్కఁడు జైలుగోడలం
దె కుమిలి - వేరొకండు సిరినే తృణమంచు నొసంగి - ఇంక వే
రొక డురికంబమెక్కి - భరతోర్వికి దాస్యముబాపె - ఆ చరి
త్రకు ప్రణమిల్లి భారతపతాకమునెత్తుము నేడు సోదరా !

సిరులకు వాసమౌ భరతసీమను పాదముమోపి - పెక్కు వ
త్సరములు రాజ్యమేలి - మన దాస్యముతో చెరలాటమాడి - ఆ
ఖరికి "అహింస" గెల్వగ దుకాణములెత్తిరి తెల్లవారు - ఈ
చరితము గుర్తులేనియెడ జాతిపురోగమనమ్మె ప్రశ్నయౌ !

పదవుల్ ధ్యేయములై - విశుద్ధమగు సేవాభావమే శూన్యమై
కదనుండ్రొక్కుటకాదు నేఁడు మన ముఖ్యంబైన కర్తవ్యః మ
భ్యుదయం బేర్పడ భారతోర్విపయి ఒక్కొక్కండు నిస్వార్థ శ
క్తి దలిర్పన్ గృషిసల్పుచున్నపుడె గాంధీయాత్మ శాంతించెడిన్ !

మతతత్త్వంబది మిన్ను ముట్టినది - హింసావృత్తికే స్వార్థజీ
వితమే యంకితమయ్యె - మానవతపై విద్రోహమున్సల్పు దు
స్థితి నానాటికి హెచ్చె - లేదు సమతాధ్యేయంబు - కర్ఫ్యూలతో
బ్రతుకుల్ సాగుచునుండ - దేశభవితవ్యంబెటు రూపొందెడిన్ !

దేశద్రోహులు కొందరేకమయి బస్తీమే సవాలంచు - ఆ
వేశాస్త్రల్ గురిపించుచుండ - భరతోర్వీమాత సైరించునే !
ఆశల్ తీవలుసాగి - పూవులయి - ఆహార్యంబులై యున్నవా
డీ శాఖామృగవేషధారణలు హర్షింపంగబోరెవ్వరున్ !

# కళావాచస్పతి

ఆరుపదుల వసంతాలు - సారవంత
మైన జీవితమ్ముననకు భాష్యంబు చెప్పి
ధిషణుడై - " కళావాచస్పతి " వహియించి
నట్టి కవితారవీంద్రు " జగ్గయ " కు నతులు !

ఒక్క నయాగరా యురికెనో - మరియొక్క వినీలమేఘమే
దిక్కులు పిక్కటిల్ల నినదించెనొ - వ్యాఖ్యల కందరావు ! ఆ
ఫక్కి, విలక్షణంబయిన పల్కు, స్వరం బతగాని సొమ్ము ! ఆ
చెక్కిన వాచకాభినయశిల్ప - మనన్య - మసాధ్యమేరికిన్ !

ఆతడు తెల్గువాణికి మహత్తరకీర్తి గడించిపెట్టె - నాం
ధ్రేతరులౌ మహానటులకెందరికో గళదానమిచ్చి; వి
ఖ్యాత "మనోహరం" బయిన గాత్రసమృద్ధికి చేతులెత్తెగా
దే ! తమిళోర్వి;.... ఆతడొక తీయని వెన్నెల చిత్రసీమకున్ !

ఆంగ్లసాహిత్య శిఖరాల నందుకొన్న
పుస్తకమ్ముల కాతని మస్తకమ్ము
వెలవు ! అతడు తీర్చిన గ్రంధనిలయమందు
తలను దాచుకోనట్టి గ్రంధాలులేవు !

ఒక మధురానుభూతికి మహోన్నతశిల్పము చెక్కినట్లు - వా
ణికి కవితానివాసమును నిర్మితజేసినయట్లు - రాగదీ
పిక నిలబెట్టినట్లు - కనిపించెనహో "సుషమా"ఖ్య సౌధచం
ద్రిక; ...కవితారవీంద్రు రసదృష్టికి దోయిలిపట్టె నాతడున్ !

" విశ్వకవి " తకు   పద్యకవిత్వమందు
రమ్య రసమయ ఫణితి   నాంధ్రత్వమిడిన
" జగ్గయకవీంద్రు " షష్ట్యబ్ది సన్మహంబు
జాతిచరిత కలంకృత గీతమయ్యె !

నాణెమున కొక్కప్రక్కన నటునిముద్ర
చూచిరేకాని - మఱిప్రక్క సుకవిముద్ర
కాంచనే లేదు పెక్కురు !.... కళలరాణి
వాణితీర్చిన విలువైన నాణెమతడు !

స్నేహవీణపై సరిక్రొత్త జీవరాగ
మాలికలు పాడినట్టి సమ్మాన్యుడతడు !
శారదాదేవి క్రొమ్ముడిలో రహించి
సురభిళించిన ప్రతిభాప్రసూనమతడు !

" మంచికి మహావనమ్మయి - మానవతకు
వింధ్యగిరియౌచు వింటికి పెరిగి " నట్టి
" సీతరామయ్య " జనకు డాశిషమొసంగి
మురిసెనేడు ! " పుత్రోత్సాహ " భరితుడగుచు !

" దానకర్ణుడు ! అపరగంధర్వు " డనుచు
తనను కీర్తింప - తండ్రి పొంగినది లేదు !
కాని - యీప్రొద్దు - దివ్యవీక్షణముల, సుతు
నెదిగిన కళాతపస్వి వీక్షించి మురిసె !

ఒక ప్రక్క కవనమ్ము వికసింప - పరిమళిం
చినది - మాజగ్గయ్య జీవనమ్ము !
ఒక ప్రక్క నటనమే యుదయింప - కీవిగా
వెలిగె మాజగ్గయ్య వెండితెరయు !
ఒకపక్క గగనవాణికి నలంకారమై
నిలిచె - మాజగ్గయ్య గళవిపంచి !
ఒకపక్క వాస్తు విద్యోతింప - రహియింప
జాలె మాజగ్గయ్య శాస్త్రదృష్టి !

మైల సోకని రాజకీయాలలోన
మెరపు దీవగ వెలిగిన మేటి - ప్రాజ్ఞ
లోక మభినుతించిన పెద్ద - నాకలమ్ము
అతని కీర్తించి ధన్యత నందె నేడు !

# పౌష్యలక్ష్మి

నెమ్మదిగ కాలుమోపుమీ నేలపైన -
కొనలుదేరిన గాజుపెంకులకు - కాళ్ళు
రక్తసిక్తంబులగు; చరిత్రను హుళక్కి-
ఇట్టి దృశ్యాలు - మమ్ము మన్నింపుమమ్మ !

* "ఊరు" "వాడ" లు కొన్ని కర్ఫ్యూలనోళ్ళ
జిక్కికొనియున్న వింతను - చిక్కువడక
నెటుల విచ్చేసెదోకదా !... ఇవి యనూహ్య
సన్నివేశాలు - తొలగని జ్ఞాపకాలు !

దారిలో అక్కడక్కడ "కారు" నలుపు
బూదికుప్పలు కనిపించు - భోగిమంట
లనుకొనెదవేమొ ! కావవి ! ఆగ్రహాగ్ని
కంకితంబైన వస్తువాహనములవ్వి !

త్రోవలో కొన్నితావుల రుధిరముద్ర
లగపడును నీకు - కుత్తుక తెగినయట్టి
కోడినెత్తురు కాదది ! క్రూరమైన
గుండుదెబ్బకో - కత్తికో - కూలెనరుడు !

ఏమి ఆతిథ్యమిడలేని - ఈవిషాద
జనతమధ్యకు నీవొక్కసారి వచ్చి
అభయమందించి - ఓదార్పుమమ్మ ! ... విరియు
బంతిపూలు రేపటికైన పౌష్యలక్ష్మి !

---

* ఊరు = గుంటూరు, వాడ = విజయవాడ [రంగాహత్యానంతర రంగం]

# రస రేఖలు

## త్యాగరాజు :

రసధునిగా స్రవించి - రఘురాముని పాదములాశ్రయించి - న
లైన పరమాత్మతత్త్వమును తీయనికంఠముతోడనింపి - సం
తసమిడి గానభారతికి - ధన్యతగాంచిన త్యాగరాజు కీ
ర్తిసుమము వాడునే ! పరిమళించు నజస్రము భక్తపీఠిపై :

## శ్రీ శ్రీ :

వేకువపాటపాడి - అవివేకుల నిద్దురమేలుకొల్పి - ప్ర
త్యేక పథమ్ముచూపి - నవతేజము వారికొసంగి - భవ్యమా
ర్గీకము పంచి - అభ్యుదయవీధులలో విహరించినట్టి - " శ్రీ
శ్రీ " కి - మహాకవీంద్రు రసలేఖినికిన్ - కవితా ప్రణామముల్ :

## వేపచెట్టు :

ఒకడు సుధాంబుధారలిడి యూపిరులూదిన - నిర్దయుండు వే
రొకడు కుఠారమెత్తి తన నుక్కడగించిన - వేపచెట్టు - పా
క్షికమగు దృష్టితోడ పరికించిన జాడలు లేవు - శూలికే
ని - కటికిచేదు బంచు - గమనింపుమ వే సహజస్వభావముల్ :

## గ్రంథాలయంవం :

వాడిపోనట్టి గ్రంధపుష్పాలలోన
పులిసిపోని మరందమ్ము కలదు - తరుగు
లేని సురభిళమ్ముకలదు - జ్ఞానతృష్ణ
కలుగువానికి - కరతలామలకములవి :

## బా ట సా రి :

నీవు కనలేదు - నడచిన త్రోవనెన్ని
పాదముద్రలు పడినవో ! బాటసారి !
కాని - కలడొక చిత్రలేఖకుడు ! వాని
కుంచెకెక్కని దృశ్యపంక్తులు హుళక్కి !

## మధునాపంతుల (మధుసప్తతి) :

స్వాగతము పల్కె కోకిలస్వామి - గంధ
ములదె మల్లిక - ప్రకృతియే యంజలించె
" సప్తతి " మహోదయానంద సౌధమందు
ఆంధ్రుల పురాణ " మధు " మూర్తి అడుగులిడెను !

## మం డే లా :

తీయనికంఠమెత్తి - రసదృష్టికి హారతులెత్తి - స్వేచ్ఛయే
గేయముకాగ - క్రాంతిగురు కేతనమెత్తి - చిటారుకొమ్మపై
" కో " యనిపాడు కోకిలము క్రూరముగా చెరలోన మ్రగ్గు ట
న్యాయము - వర్ణ భేదములు నాల్కలు సాచిన - కాంతియున్న దే !

## పె రి స్త్రో యి క :

ధ్యేయమునై పుగా అరుణదీపముచూపి - నృపాలుడై ప్రజా
శ్రేయమెరింగి - తొల్లిటి చరిత్రను తీరిచిదిద్ది - నూతనా
ధ్యాయము చేర్చి - విప్లవపతాకమునెత్తిన గొర్బాచెవ్ " పెరి
స్త్రోయిక " దేశదేశములలో నవకాంతికి నాందియయ్యెడిన్ !

# శుక్లవత్సరాదీ! సుస్వాగతం

అడుగు పడుటలేదు - అన్ని మార్గాలలో
కంటకాలు బుర్రకాయ లెత్తె;
ఎచట గ్రుచ్చుకొనునో! ఎప్పుడు రక్తమ్ము
చిమ్మునో! విధాత చెప్పలేదు!

గద్దె నెక్కినట్టి పెద్దలే చిన్నలై
ముష్టియుద్ధమందు పొర్లుదుపుచ్చు -
బడుగు గుండెకింక భద్రం బదెక్కడ?
ఏ "ఉగాది" వచ్చి హెచ్చరించు!

ప్రకృతి విలువలవలువలు చిరిగిపోయి -
నిండు సభలోన, వేడి కన్నీళ్ళలోన
తడిసిపోయిన పింక - ఉదాత్తమైన
వార్తయొక్కటి లేదు - దీనార్తి తప్ప!

ఇంటిలోన మంట లింతింతలై లేచె -
ఇంటిపైన మంట లెగయుచుండె -
ఏమిటీ విచిత్ర కృతకదృశ్యమ్ములు?
మనిసి కాత్మలో విమర్శవలయు!

చమురులేనట్టి దివ్వెతో జాతి నేడు
కృష్ణ పక్షమ్ములో పయనించు చుండె!
"శుక్ల" వత్సరాది! శుభమస్తు! విజయోస్తు!
శుక్లపక్షము వెలయించి శోభనిమ్ము!

# ఎక్కడున్నవి వెలుగులు ?....

కమలముల కధి " మతము " భాస్కరుని వెలుగు -
కలువలకు స" మ్మతిము" హిమకరుని జిలుగు -
పలచిన "మతమ్మ్"లేవైన - బ్రతుకునిచ్చు
కొలనుకెన్నడు చేటును గూర్పలేదు ;

మనుజుడా - మతపను ముసుగున
జనయిత్రిని గూల్పగలడు - సహజన్ములనే
తును మాడగలడు - మానవ
తను మరచి - తమస్సు గ్రిక్కి - దైత్యుండె యగున్ !

ఒక నరకుండు కాదిపుడు - ఊహకుమించిన రక్కసీంద్రు - కాం
తికి వ్యతిరేకశక్తులయి దేశములో తలలెత్తినారు - శాం
తికి నవరోధమేర్పడెను - ధ్యేయమువైపు పురోగమించు జా
తికి నొక " సిక్కు " ప్రశ్న విడదీయనిదై తల బొప్పికట్టెడిన్

వరకట్న సమిధగా - వనిత యొకర్తుక
మంటలో మలమలా మాడిపోయె !
కాఖీల లాఠీకి - ఖైదీ యొకడు - నిస్స
హాయత కనుగ్రుడ్ల నప్పగించె ;
శీలహరణ వధ్యశిలపైన - నొకలేమ
బ్రతుకు జాఱిపడగ వాడిపోయె ;
దాడిదోపిడిలోన - దానయ్య యొక్కండు
నెత్తుటి మడుగులో నొత్తిగిల్లె ;
ఎక్కడున్నవి వెలుగులు ? చిక్కనైన
చీకటులు తప్ప; ప్రతియేడు శీర్షమెత్తి
నరుడు - నరకుండు లేడను నమ్మకమున
పాడుచున్నాడు కాంతి కాహ్వానగీతి !

రసరాజు

# రసానుభూతి

మునురుపట్టిన వేళలో పొగలు గ్రక్కు-
వేడితేనీటిసుధను సేవించుచుండి
కవితలల్లుటలోన స్వర్గంబుకలదు -
అనుభవైకవేద్యుని కది యర్థమగును !

ప్రణయసఖితోడ వెన్నెలరాత్రులందు
నిసుకతిన్నెలపైన ప్రేమైకగీతు
లాలపించుచు జంటగా నడుగులిడుట
ఎంతటి రసానుభూతి ! వర్ణింపదరమె !

కోమలంబగు పచ్చిక గూరుచుండి
గలగలా పారు సెలయేటి జలములోన
నడుగు లట్టిటు కదలించి తడుపునపుడు
కలుగు యనుభూతి కెచట వ్యాఖ్యలు లభించు ?

వర్షఋతువు బాల్యమ్ములో హర్ష ఋతువు
కాగ - గుమ్మములనిలిచి - కాగితాల
పడవలను వాననీటిలో వదలునపుడు
దొరకు సరదాను దేనితో తూచగలము ?

కొండలందున గొంతెత్తి "కో" యనంగ
స్నేహశిల్పమ్మునకు క్రొత్తజీవమూది
తిరిగి "కో" యని కొండ ప్రతిధ్వనించు
నప్పు డెంతటిహాయి ! భాష్యంబుకలదె !

నీలిమబ్బుల నింగిమున్నీట దేలి
మించు రెక్కలతెడ్ల నాడించుకొనుచు
దూసుకొనిపోవు పిట్టలతోడ - కనులు
పలుకు లిడుకంటె దృశ్యకావ్యంబు కలదె !

చీకటినిజీల్చి - కాంతిపతాకమెత్తి
వారినిధిగర్భమునుండి పైకిలేచు
సూర్యబింబోదయమ్మును జూచినప్పు
డలరు మోదవార్ధికి సరిహద్దులేవి ?

# నవ్యజీవనసంక్రాంతి

బంతిపువ్వులకన్న పసుపుపచ్చని వన్నె
జీవితాలందు భాసించునాడు -
రంగవల్లులలోని రమణీయమగు శోభ
జీవితాలందు రాజిల్లునాడు -
పొంగలిలోగల్గు పొంగారు మధురిమల్
జీవితాలందు వర్షించునాడు -
బొమ్మలకొలువులో బొడచూపు వేడుక
జీవితాలందు వాసించునాడు -

ప్రత్యణువు పర్వరాజమై పరవశించు !
ప్రతిదినము పౌష్యమాసమై పరిమళించు !
హృదయవీధిలో దివ్వియలెత్తినాడు
నవ్యజీవనసంక్రాంతి నవ్వుకొనును !

# బుద్ధపూర్ణిమ

తెలుగుగడ్డపైన వెలిగించగ "సహింస"
గాఢతమమదేల కౌగలించె !
దిగులు పడగనేల? దీక్షదొడ్డది - మంచి
పనులవేవి నీటిపాలు కావు !

శిలను చెక్కి - కరుణ వెలికితీసి - జగాన
తెలుగువాడు కీర్తి వలచునాడు
'సాగర'మ్ములో విషమ్ము చిందిననేమి?
దెబ్బతగులదెపుడు ధ్యేయమునకు !

సర్వమతములందు సమరసబుద్ధుడై
ఆయువైన ధారవోయగలుగు
తెలుగువానిలోని వెలిగెడి పూర్ణిమ
నిఖిలజగతి దీప్తి నింపుగాక !